# శ్రీ నరసింహ కర్ణామృతము







This Book is Printed with the Finacial Assistance of the Tirumala Tirupati Devasthanams, Tirupati under their scheme "Aid to Publish Religious Books".

సాహిత్య విద్యా ప్రవీణ
భాషాప్రవీణ, రాష్ట్రభాషా విశారద
మైలవరపు సుబ్రహ్మణ్యము
కోదుకొండ.

శ్రీ నరసింహ కర్ణామృతము
ప్రథమ ముద్రణము
జూన్, 1980

*

వెల: రూ. 5/-
సర్వస్వామ్య సంకలితము

*

ప్రాప్తి స్థానము:
మైలవరపు సుబ్రహ్మణ్యము
రిటైర్డ్ జూనియర్ లెక్చరరు
కోరుకొండ, తూర్పు గోదావరి జిల్లా

*

ముద్రణ:
శ్రీమయూర్ ప్రింటర్స్
రాజమండ్రి-1
ఫోన్ నెం. 6247



"వేగ ప్రహ్లాదు మును బ్రోవ వెలసిన ప్రభు !
మేలుౘ లిడు మేలు దేవ! మ న్నేలు నృహరి"

# ప రి చ య ము

శ్రీ నరసింహ కర్ణామృతము భక్తి ధారాపూర్ణము, శతక త్రయాత్మకమునైన సత్కృతి. సంకల్పము, ధ్యానము, ఆవాహనము, అర్చనము, నివేదనము, దయాభ్యర్థనము, అజ్ఞాననిరసనము, సుజనప్రశస్తి, సృష్టివైచిత్ర్యము, శరణాగతి, కరావలంబము, మంగళము—అన్నవి పంద్రెండు బిందువులు. ప్రతి బిందువు ఛందోగంధిలము, భక్తి నిష్యందము, శ్రద్ధా బంధురము, వినయ సుందరము.

కర్ణామృత కర్త శ్రీ మైలవరపు సుబ్రహ్మణ్యము గారు సంస్కృతాంధ్ర భాషలయందు సమర్థమైన అధ్యయనాధ్యాపనములు చేసిన పండితులు, సహృదయులు. నైసర్గికమైన వారి దైవనిష్ఠకు ఈ చిన్నికృతి యొక రూపావిష్కృతి.

ఈ గ్రంథములో ప్రతిబిందుముఖమున నొక శ్లోకము పొందుపఱుపఁబడినది. తిలకాయమానములైన ఆ శ్లోకములు కృతి కర్తయొక్క అమృతభాషా రక్తికి సూచికలుగా నున్నవి.

ఏదో పద్యము నడిపించుటకు గాక, ఒక్కొక బిందువులో ఒక్కొక విశేషము చూపించుటకు యత్నింప బడినది సంకల్ప బిందువులో కేశవనామములు వరుసగావచ్చునట్లు చేసిన సీసము, ధ్యాన బిందువులో ఆద్యంతములందు శ్లోకద్వయము నిలుపుట, ఆవాహన బిందువులో "సద్యోవిదారితశిలాస్తంభ సముద్భూత

నిజభయానక రూప విజిత దనుజ!" ఇత్యాదులు పాదైక
మాసరచనలుగా నున్న సీసమాలిక చూడవచ్చును. శ్రీ న
సింహస్వామి దుష్టరాక్షస శిక్షకమైన భయానక రూపము
ఈ సమాసములు వ్యంజకములుగా ఉన్నవి మరల-"శార
నీరద గౌరగాత్రమ్మున...." అను పద్యమునందలి సుకుమారస్ఫ
ూర్తి ప్రహ్లాదుని గనికరించిన యనుగ్రహమూర్తికి స్ఫోర
ముగా గావింపఁబడినది. ఆవాహన బిందువున ఆటవెల
సంస్కృత రచనలో నడపుట సొగసుగా నున్నది. అర్చ
బిందువున, అష్టోత్తరనామములు స్ఫురించుచున్నవి. నివేద
బిందువునందు"సీసాలనిండ నీసేవకై గూర్చితి మన్మానసలతా
మధురసమ్ము' మన్నగు సీసము నవ్యభావ మనోహరము. దయా
భ్యర్థనమున మనసు విప్పిచెప్పిన మాటలు, "అజ్ఞాన నిర
నము"లోని కొంత లోక ప్రవృత్తి విశేషము చెప్పాలయ
మనోరంజనమ్ము కలిగించు చున్నవి.

సృష్టిపై చిత్ర్య బిందువులోని యీ పద్యము ఒకటి
చాలును, కర్ణామృత కర్తయొక్క లోకజ్ఞతా, వివేకము
పరిపాకము గుర్తించుటకు

ఎల్లరు ధర్మజులే యాట చాలదు,
శకునులున్ వలయు నీ జగతి కెపుడు;
సృష్టి నిండుగ సీతలే యుంట చాలదు
తోడనే మంథరల్ గూడ వలయు;

నిత్యతృప్తులు సత్యనిరతులే చాలరు,
వలయు ఘాతుకులును వంచకులును;
మలయానిలములు వెన్నెలలునే చాలవు,
వలయు నుప్పెనలు నుత్పాతములును;

ఈ విరుద్ధ విభిన్న స్వభావములను,
సృష్టి నిర్మాణ కారణ త్రిగుణాగతులఁ
దెలియఁ గలవారెగద నిన్నుఁ దెలియఁగలరు !
మేలు లిడు మేలు దేవ ! మ మ్మేలు నృహరి !

ఇశ్లో - మొత్తము సర్వపద్యములందును నిర్వ్యాజము నిభృతము నిర్మలము నైన భక్తి భావము రక్తిగా వ్యక్తము చేయబడినది. మిత్రులు శ్రీ మైలవరపు సుబ్రహ్మణ్యముగారు తనతోపాటు పాఠకునిగూడ శ్రీ నరసింహ కరుణాపాత్రునిఁ జేయుటకుఁ గావించిన యీ కృతి మిక్కిలి యభినందనార్హము.

రాజమండ్రి
12-6-'80

మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి

—: 0 :—

# OPINION

Dr. D Arka Somayaji, M A , Ph.D ,
Secetary
Hindu Dharma Rakshana Samstha
T. T. Devasthanams, Tirupati

I have had good occasion to go through the book "Sri Narasimha Karnamritam" written by Sri Mylavarapu Subrahmanyam garu, formerly a Telugu lecturer in a Govt. Junior College. I am glad to say that the poetry is not only flawless but also mellifluous We have a couple of books in Sanskrit called Sri Krishna Karnamritam and Sri Rama Karnamritam. Taking the clue from these captions, the author, who appealed to me as a devotee of Sri Narasimha, chose to name his book as such. I can easily say that the author is a good scholar and this I say, because, we come across many Telugu poetic pieces, which betray lack of scholarship. May Lord Narasimha inspire the author to write many more books of this type, which, I am sure will go a long way to inculcate a sense of devotion in the hearts of many a reader, who have the fortune to go through such books!

(Sd,) D. Arka Somayaji
14-6-80

# విజ్ఞప్తి

ప్రస్తుత "శ్రీ నరసింహ కర్ణామృతము"లోని ఈపద్యములు



మొదట నేను ఆటవెలది, సీసము, కందము అను వేఱు వేఱు ఛందములలో చెప్పిన మూడు శతకముల నుండి గ్రహించి నట్టివి, విభిన్న కాలములలో చెప్పిన ఈ మూడు కృతులలోని ముక్తకములకు ఏక సూత్రత గూర్చుటకై ఆ మూనామములతో ఈ విభాగములు కల్పించి భక్త సోదరులను ఉన్ముఖులను చేసికొనుటకు గ్రంథమునకు ఈ పేరు నెన్నికొంటిని. ఇట్లు ఈ గ్రంథనామమును, ఈ విభాగములను మొదట నిర్ణయించి ఈ పద్యములు వ్రాయబడలేదని మనవి చేయుచున్నాను.

ఇందు స్తోత్రరూప పద్యములలో యథాశక్తిగ శ్రావ్యత గల సుందరమైన గమనమును సాధింప యత్నించితిని. భావ ప్రధానములైన పద్యములలో విషయము తేట తెల్లముగ నుండవలయునని యెంచితిని. తెలుగుపద్యములనిన భయము

నొందు సామాన్య పాఠకులలోగల భ్రమను దొలగించుటకును తెలుగుపద్యముల తియ్యాదనమును గ్రహింపజేయుటకును నేడు ఎందరో పెద్దలు పలువిధముల కృషిచేయుచున్నారు. అట్లే భక్తి సాహిత్యము ప్రజా జీవితమున గొప్ప మేలుకూర్చునని తద్వ్యాప్తిని ప్రోత్సహించు చున్నారు. నా యత్నము వారి యుద్యమమునకు దోహదకారి కావలయునని ఆశించుచున్నాను.

నూతన ప్రక్రియగానున్న ఈ కృతిలోని లోపము లను మన్నించి విజ్ఞులైన సహృదయులు గుణముల నాదరింతురని వినయముతో ఆశించుచున్నాను.

నేను ఇచ్చట చెప్పవలసిన ఒక విషయమును ఎఱ్ఱా ప్రగడ మహాకవి నృసింహ పురాణ పీఠికలో, నిజమునకు తన యంతటివాడు చెప్పికొన నక్కఱలేకున్నను నా కొఱకే యను నట్లుగా పూర్వమే చెప్పియుంచెను. కావున ఆ పద్యమును ఈ నా నరసింహ కర్ణామృత పీఠికలో సంతోషముగా చేర్చు కొను చున్నాను.

"మించిన వేడ్క వీనులకు మిక్కుటమై మధువృష్టి గ్రమ్మ రా
యంచలు గూయఁ గ్రౌంచమును నావలఁ గూయఁగ డంగు
భంగిఁ బ్రా
ఢాంచిత శబ్దసారులు మహాకవు లాద్యులు కావ్యశయ్యఁ గీ
లించిన కీర్తిసంగసుఖలీలకు నేనును గాంక్ష సేసితిన్,"

ఈ నూతన రూపములో దీనిని వెలువరించుటకై భయ సంకోచముల నొందుచున్న నాకు ధైర్యమును ప్రోత్సాహము నిచ్చి సౌహార్ద్రముతో నాకృతిలోని గుణములనే యెంచి చూపుచు, పాఠకలోకమునకు నా గ్రంథమును పరిచయము చేసిన శ్రీ మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి గారికి నా హృదయపూర్వక కృతజ్ఞతా వందనములర్పించు చున్నాను.

నా కోరికను మన్నించి తీరిక చేసికొని ఈ రచనను పూర్తిగ చదివి "నాకు తృప్తికలిగించిన కృతి యిది" యని తమ అమూల్యాభిప్రాయము నొసగిన డాక్టర్ ధూళిపాళ అర్క సోమయాజి గారి సౌజన్యమును కృతజ్ఞతా వందనములతో స్మరించుచున్నాను.

ఏతద్గ్రంథ ప్రచురణముగూర్చి తమ్ము దర్శించగా మొదటి పరిచయములోనే నన్ను ఆప్యాయముగ పలుకరించి బహుజన హితముగా ఇతోధిక గ్రంథరచనము సాగించవలసినదిగ ప్రోత్స హించుచు గౌరవాదరములు చూపిన శ్రీ రావుల సూర్యనారా యణ మూర్తి (ప్రజాసంబంధ శాఖాధికారి, తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి) మహాశయుల సౌమనస్యము నేను మరువలేనిది.

అనేక బలహీనతలకు లోనై యున్న నాకు ఈ ప్రచురణ కార్యమున అడుగడుగునను పలువురు మిత్రులు, సత్పురుషులు సాయపడియున్నారు శ్రీ నరసింహస్వామియే వారి రూపమున నాకు తోడుపడు చున్నట్లు నమ్ముచు నరసింహాంశ గల్గియున్న వారికెల్లరకును శ్రీస్వామి సర్వశ్రేయములు నొసంగుగాక యని ప్రార్థించు చున్నాను,

ఇట్లు
బుధజన విధేయుడు
రచయిత :



## -: విషయానుక్రమణికా :-

పుట



—:0:—

## కృతజ్ఞతాంజలి

సీ. ఏ దేవు పావన పాదాబ్జ సంస్మృతి
కలిపాప సంహార కారి ధరణి,
ఏ విభు కరుణార్ద్ర వీక్షణమ్ము నిరతమ్ము
వర్షించు కోర్కులు భక్త తతికి,
ఎవ్వాని యైశ్వర్య, మెవ్వాని విహరణ
మ్మున లేనిదై యుండు పృథివి నందు,
భక్తుల స్వర్గమ్మొ, కవుల వైకుంఠమ్మొ
తనరారు నవని క్షేత్రమ్ము సతము

గీ. ఎవని శోభన మూర్తినై భవము గాంచ
జన్మ ఫలియించె నను సంతసమ్ము గల్గ,
నట్టి నీ కరుణామృత మ్మొంద గనిన
ధన్యుడను స్వామి! కొనుము వందన శతమ్ము.

* * *

క. మును మా తెనుగుల వేల్పని
కొనియాడితి నిన్ను కోదండను గల దే
వుని, దాని నేను కొండల
తెనుగుం దైవమె మహామతిం బ్రకటించెన్.



The author expresses his deep sense of gratitude to the "TIRUMALA TIRUPATI DEVASTHANAMS, TIRUPATI" for the financial aid extended to publish this book.

శ్రీ

# నరసింహ కర్ణామృతము

## 1. సంకల్ప బిందువు

శ్లో. ఉపాసిష్యే నారసింహం

సకలాభ్యుదయావహమ్ ।

ప్రణాశితా సురవ్యూహం

ప్రణతార్తి భయాపహమ్ ॥

*  *  *

క. శ్రీ లక్ష్మీ నరసింహా !

పాలిత సురసంఘ ! శమిత పాపౌఘ ! సము

న్మాలిత దుర్గర్వాసుర ।

లాలిత నిజభక్త । అమృతలహరీ । నృహరీ ॥

*  *  *

సీ. విఘ్నాపనోదన విఘ్నాంఘ్రిసరసీజ ।

సర్వభద్రప్రద సన్నిధాన !

అపవిత్ర తాపహా ! సుపవిత్ర తావహా !

బాహ్యాంతరశుచిత్వ వరనిదాన !

చిత్తప్రసాదన ! చిత్సుఖ సంధాన !
సిద్ధిబుద్ధిప్రద ! స్థిర సుకరుణ !
పుండరీకాక్ష ! సత్పురుష రక్షా దీక్ష !
స్మరణానుపదలభ్య సత్కటాక్ష !

గీ. సకలబాధ భయ వారణ ! సర్వశుభద !
చింతితాశేష సత్కార్య సిద్ధిదాయి !
నామసంకీర్తనప్రీత ! కామవరద !
మేలుకిడు మేలుదేవ ! మమ్మేలు నృహరి ॥ 2

* * *

సీ. కేశవ ! సర్వలో♦కేశ వరప్రద !
నారాయణా ! శ్రిత♦పారిజాత !
మాధవ ! సంశ్రిత♦సాధునశంవద !
గోవింద ! యోగీంద్ర♦భావసదన !
విష్ణో ! పతార్తి హా♦రిష్ణో ! సుఖారాధ్య !
మధుసూదనా ! శ్రిత♦బుధశరణ్యా !
హే త్రివిక్రమ ! నుతి♦పాత్ర సుచారిత్ర !
వామన ! దినకర♦సోమనయన !
శ్రీధర ! ఘన ధర♦ణీధర ధూర్ధర !
హే హృషీకేశ ! దు♦ర్మోహనాశ !
పద్మనాభ ! సుమన♦స్పద్మ సదావాస !
దామోదరా ! మహో♦ద్దామ విభవ ! 3

సంకర్షణా! పాపపంకాపకర్షణా!
వాసుదేవా! శ్రీనివాసదేవ!
ప్రద్యుమ్న! భాస్వరవిద్యుత్సహస్రాభ!
అనిరుద్ధ! జగదుద్ధరణ నిబద్ధ!
పురుషోత్తమా! సర్వసుర సత్తమారాధ్య!
హే అధోక్షజ! శాంత! హే అనంత!
నారసింహా! వినివారిత భక్తాంహా!
అచ్యుతా! నతిమాత్రవిచ్యుతాఘ!
హే జనార్దన! హార్దపూజనాతి ప్రీత!
హే ఉపేంద్ర! అమోఘ! హే అమేయ!
హే హరే! దుర్మదలోహ శృంఖలహరే!
శ్రీకృష్ణ! ధుతభక్తలోకతృష్ణ ॥ ౪

* * *

౫. శ్రీశ! శ్రీనివాస! శ్రితభక్త మందార!
నిలుపుకొందు నెపుడు నిన్ను మదిని,
మంచిత్రోవచూపి మము నడిపింపుము,
దీన సుజన బంధు! శ్రీనృసింహ! ॥ ౫

—:0:—

## 2. ధ్యాన బిందువు :

శ్లో. శరణ్యం సర్వలోకానాం,
వరేణ్యం భక్తవత్సలమ్ ॥
కారుణ్యామృత-వారాశిం,
ధ్యాయామి నృహరిం పరమ్ ॥ 1

* * *

క. నీ పాదధ్యానము మా
కాపద్ఘన తిమిరనాశి యర్క-ప్రభయా,
పాప వనదవాగ్నియగు, మ
హాపుణ్యామృత సువృష్టి యా ప్రభు ॥ నృహరి ॥ 2

* * *

ఆ. దేవ! నారసింహ! నీవె మాతండ్రివి,
నీవె గురువు, సఖుడ వీవె బంధు,
వీవె విద్య, ధనము, నీవె మాసర్వము నీ
దీన సుజన బంధు! శ్రీనృసింహ ॥ 3

* * *

సీ. నిన్ను సేవించెద, నిన్ను భావించెద,
నిను వేడుకొందు, నిన్ బాడుకొందు ;
మౌనినై యున్నను, మాటాడుచున్నను
నీయందె నామది నిలచియుండు ;

కనుమూసియున్నను, గాంచుచున్నను, నీదు
కమనీయమూర్తినా కనులనిండు,
నీవె నాయాప్తుడ, వీవె నాస్వామివి
నీవె మత్సర్వమ్ము దేవ దేవ!

* * *

సీ. కోరి శారీర యాత్రకై వేఱుపనులు,
పలుకు లొప్పుదు గాని నాస్వాంత మెప్పుడు
నీదు పాదాబ్జచింతతో నిండియుండు,
మేలులిడు మేలు దేవ! మమ్మేలు నృహరి ॥ 4

* * *

ఆ. సరసిజదళ నేత్ర! సాధుమిత్ర! కృపాళు!
భవజలనిధి పోత! భాసమేత!
విహిత విబుధతోష! వీతరోష! సురేశ!
శ్రిత సమవనరంహ! శ్రీనృసింహ ॥ 5

* * *

శ్లో. సరసిజ దళనేత్ర స్సాధుమిత్రః కృపాళుః,
భవజలనిధిపోతో భాసమేతో హరిర్నః।
విహిత విబుధతోషో వీతరోష స్సురేశః
శ్రితసమవనరంహాశ్శ్రీనృసింహాస్స దాఽవ్యాత్ ॥ 6

## 3. ఆవాహన బిందువు :

శ్లో. ఆవాహయామి నృహరిం,
నిర్మాలిత మనోమదమ్ ।
ఉన్మీలితాత్మ సమ్మోదం
పరమాత్మాన మాత్మని ॥ 1

* * *

సీ. కలదు ధరిత్రిని, కల డాకసమ్మున
కలదు జలమ్మున, కలడు వహ్నిఁ
గలదు మారుతమందు, కలదు భాస్కరునందు
కలదు చంద్రునందు, కలదు దిశల,
కలదు మర్త్యాలయంబు, కల డమర్త్యాలయందు
సకల చరాచర జాలమందు
నాకలోకమ్మున, నాగలోకమ్మున
కల డీతు డఖిల లోకములలోన

* * *

గీ. కలదు కల డన్న భక్తు వాక్యమ్ము నిలుప
స్తంభమందున వేగ నుద్భవము నొంది
శిష్టరక్షణ సేయవె దుష్టు నణచి
మేలులిడు మేలు దేవ ! మమ్మేలు నృహరి॥ 2

సీ. సద్యోవిదారిత స్తంభ సముద్భూత
నిజభయానక రూప విజిత దనుజ!
దుర్దమ దైతేయ మర్దన విక్రాంత
చరణ విఘట్టన చలిత వసుధ!
విచలిత శాత్రవ వీర మనోధైర్య
భీషణ వివృతాస్య విచల దధర!
క్షుబ్ధ భీకర దందశూక ప్రతీకాశ
జిహ్వా విలోకన విహ్వలారి!
నిశ్శేష రక్షో వినిర్మూల నాభీల
యత్నప్రకాశి మహాట్టహాస!
శక్రాయుధ కఠోర శాత భీకరనఖ
ద్యుతిహృత శాత్రవధృతి మహత్త్వ!
చండగభస్తి ప్రచండ దంష్ట్రాప్రభాం
ధీభూత దైత్యేంద్ర నేత్రయుగళ!
సర్వ గీర్వాణారి గర్వ నిర్వాపణా
చణ మధి రారుణ చండనయన!
ప్రళయ విజృంభిత జ్వాలనోపమక్రుద్ధ
చక్షు రీక్షణమాత్ర శమితశత్రు!

* * *

గీ. భూరి హుంకార నిర్ఘోష మూర్ఛితారి!
విద్రు తారాతి సంఘాత రౌద్రగర్జ!

సంక్షుభిత రిపు హృదయ నిశ్వాసోచ్ఛ్వాస నికర !
చలిత ఘనగణ తులిత కేసర సమూహా !
చండ భుజదండ దండిత శత్రుసంఘ !
మేలులిడు మేలు దేవ! మమ్మేలు నృహరి ॥

* * *

క. వజ్రనిభ తీక్ష్ణ దంష్ట్రా !
వజ్రాయుధ నిర్విశేష భయకృన్నఖరా !
వజ్రార వాట్టహాసా !
వజ్రాయిత దృష్టిగుప్త భక్తా ! నృహరీ ॥

* * *

ఆ. అట్టహాస సంభవార్భట ఘన ఘోష
బధిరిత దశ దిఙ్ముఖః కటాహా !
శాత భీమ నఖర ! చపలాభ కేసర !
దీన సుజన బంధు ! శ్రీనృసింహా ॥

* * *

ఆ. ఉద్ధతాసు రోదర రోత్కృత్త రక్తాంత్ర
రచిత కంఠహార ! రౌద్రగర్జ !
క్రోధఘూర్ణ చండ రుధిరాక్ష ! ఘనవక్ష !
దీనసుజనబంధు ! శ్రీనృసింహా ॥

—: 0 :—

౭. శారద నీరద గౌర గాత్రమ్మున
కన కాంబరము రమ్య కాంతు లీన,
మణి కింకిణీ గణ క్వణనాభి రామమౌ
మేఖల కటితటిన్ మెఱయుచుండ,
స్వర్ణ మహీధర సాను సన్నిభ ఘన
కమనీయ వక్షము కనులవిందు,
హార కేయూర మంజీర కిరీ టాది
భూషలు తనువున మురువు నూన,

౮. శంఖ చక్ర గదా ఖడ్గ చాప కుంత
తోమ రాదిక శస్త్రహ స్తుండ వగుచు
వేగ ప్రహ్లాదు మును బ్రోవ వెలసిన ప్రభు !
మేలు లిదు మేలు దేవ! మమ్మేలు నృహరి ॥

* * *

౯. అమరనాథ, వహ్ని, యమ, యాతుధానులున్
వరుణ, వాయు, వైశ్రవణ, భవులును
నిన్ను చుట్టు జేరి సన్నుతింతురు సామి !
దీన సుజన బంధు ! శ్రీనృసింహ ॥

క. లక్ష్మీసతి యొడి నుండగ
మాక్ష్మాధర శిఖర రుచిర మందిరమున స
ద్వృక్షముల వెలసి యున్నత
పక్షీశుల కగుదు వెపుడు పండువు నృహరీ!

* * *

క. కనులన్ గన గిరి సింహా
చనమున రాజిల్లు చుండు స్వామిని నిన్నే
కను వేడ్కి మాదు మానస
ఘన పంజర సింహ మనగ గాంతుము నృహరీ!

* * *

ఆ. ఏహి నారసింహ! దేహి మే సన్నిధిం,
పాహి మాం సహస్ర బాహు నయన।
మాం విహాయ యాహి మా కదాచి ద్దేవ!
దీన సుజన బంధు శ్రీనృసింహ।

—: 0 :—

## 5. అర్చన ఖండువు!

శ్లో. బహు శక్తిం బహు కృపం
బహ్వాక్షం బహు మస్తకమ్।
బహు రూపం శ్రీ నృసింహం
అర్చయే బహు నామభిః॥

* * *

ఆ. విశ్వ! విశ్వ వాస! విశ్వేశ! విశ్వాత్మ!
కృష్ణ! విష్ణు! గుణ సహిష్ణు! జిష్ణు!
శ్రీశ! శ్రీధి! శ్రీద! శ్రీవత్స ఘనవక్ష!
దీన సుజన బంధు! శ్రీ నృసింహ॥

* * *

ఆ నగ ధర! నగ వాస! నాగేంద్ర పర్యంక!
నగ సుతా పతి నుత! నాగ వరద!
ఖగపతిరథ చారి! ఖల దనుజ విదారి!
దీన సుజన బంధు! శ్రీ నృసింహ॥

* * *

ఆ. నిగమ నివహ బోధ్య! నిఖిల బుధారాధ్య!
నిరత ముదిత భృత్య! నిహత దైత్య!
నిరుప మైక సత్య! నిత్య! భక్త స్తుత్య!
దీన సుజన బంధు! శ్రీ నృసింహ॥

ఆ. పద్మ సుంద రాక్ష! ప ద్మాధిగత వక్ష !
మాధవ! హరి! లోక నాథ నాథ!
స్తంభ సంభవా! స్వయంభువా! మత్ప్రభూ!
దీన సుజన బంధు! శ్రీనృసింహ॥

* * *

ఆ. నీరజ దళ నేత్ర! నీలాభ్ర నిభ గాత్ర!
కోటి భాను తేజ! కైటభారి!
నిఖిల భువన వంద్య! నిగ మాంత సంవేద్య!
దీన సుజన బంధు! శ్రీ నృసింహ॥

* * *

ఆ. సకల పాప వారణ చణ చర ణాంబుజ!
నత జన సుఖ దాయి నయన కమల!
అభయ దాన శస్త హస్త పంకేరుహా!
దీన సుజన బంధు! శ్రీ నృసింహ॥

* * *

ఆ. ఇందిరా విలోచ నేందీవర సుధాంశు!
భక్త చిత్త బర్హి వారి వాహ!
భక్తి వశ్య! భక్త వాంఛిత నిర్వాహ!
దీన సుజన బంధు! శ్రీ నృసింహ॥

సీ. శ్రీరమ్య! శ్రీహర్మ్య! శ్రీనాథ! శ్రీదేవ!
శ్రేయోంబ్ధి వర్ధిత శ్రిత బుధాళి!
శ్రీప్రద పద యుగ్మ! శ్రీకర కర పద్మ!
శ్రీవిలసిత వక్ష! శ్రీక రాక్ష!
అబ్జాక్ష! శత సహస్రాక్ష! విశ్వాధ్యక్ష!
రక్షిత తామర పక్ష! శిక్షి తారి!
యోగి మానస వాస! యోగేశ! నిఖిల స
ద్యోగ సంధాయక! యోగ గమ్య!

సీ. వరద! వామన! వనమాలి! వాసుదేవ!
విశ్వ! విష్ణు! త్రివిక్రమ! వేద వేద్య!
దారితాఖిల వైరి! శ్రీవత్స వక్ష!
మేలు లిడు మేలు దేవ! మమ్మేలు నృహరి!

* * *

సీ. అప్రమేయ! అనంత! అనిరుద్ధ! అచ్యుత!
ఆది దేవ! అనీశ! అసుర నాశ!
అజ! అపరాజిత! అక్షర! అబ్జాక్ష!
అధిప! అధోక్షజ! అఘ హరణ!

అభయ వరద పాణి! ఆనంద నిశ్రేణి!
అనుపమ వైభవ! అమర వంద్య!
అగము తతి వేద్య! ఆత్మజ్ఞ వర లభ్య!
అవ్యయ! అదిమ ధ్వాంత రహిత!

తే. అఖిల భూత నియామక! అమిత తేజ!
అర్క సోమాగ్ని లోచన! అహిత శమన!
అత్ర లోకైక సద్బంధు! అమృత సింధు!
మేలు లిడు మేలు దేవ! మమ్మేలు నృహరి!!

* * *

సీ. సర్వతో ముఖ! సర్వ! సర్వతో లోచన!
సర్వత్ర సంచారి! సర్వ సాక్షి!
సర్వ లోకాధార! సర్వ మానస వాస!
సర్వ సిద్ధి ప్రద! సర్వ సులభ!
సర్వ భూతాత్మక! సర్వ జీవ శరణ్య!
సర్వార్థ సాధన! సర్వ భరణ!
సర్వ పాతక నాశ! సర్వ భయాపహ!
సర్వ భోగ ప్రద! సర్వ శుభద!

గీ. విశ్వ! విశ్వద! విశ్వాత్మ! విశ్వ రూప!
విశ్వ కారణ! విశ్వాది! విశ్వ మూర్తి!
విశ్వ శాసన! విశ్వేశ! విశ్వ భవన!
మేలు లిదు మేలు దేవ! మమ్మేలు నృహరి॥

* * *

సీ. నత జన పరిపాల! నుత మాని గణ లోల!
శతమఖ రిపు కాల! స్మిత కపోల!
రుచిత కనక చేల! రచిత మాయా జాల!
అనుమత భవ లీల! అభయ శీల!
నిఖిల నిగమ మూల! నిరుపమ ద్యుతి ఫాల!
సజల జలద నీల! సుజన పాల!
కలిత లలిత మాల! దళిత దానవ ఖేల!
విబుధ జలజ హేళి! విజయ శీలి!

గీ. పిహిత నిజ కృతి నిర్ణయ! విహిత వినయ!
శమిత ఖల జన కృత దోష! అమిత తోష!
రచిత బహు మణి గణ భూష! రుచిర వేష!
మేలు లిదు మేలు దేవ! మమ్మేలు నృహరి॥

సీ. ఖేదితాసుర సంఘు! ప్రీణితాఖిల సాధు!
వ్రీడితారి సమూహా! ఈడితార్య!
త్రిగుణ మాయాతీత! త్రిదశేశ సన్నుత!
త్రిదివ బృంద శరణ్యా! త్రిభువ నేశ!
ధ్యాని గమ్య విభవ! వాణి వర్ణ్య మహిమ!
దీన సుజన బంధు! జ్ఞాన సింధు!
విశ్వోద్భవ విధాత! విశ్వ పాలన విష్ణు!
విశ్వ సంలయ కార్య విషమ నేత్ర!

గీ. సకల దిగధీశ వందిత! జగ దధీశ!
క్షీర సాగర విశ్రాంత! ధీర శాంత!
క్షిప్ర సంరక్షి తాపన్న! సుప్రసన్న!
మేలు లిడు మేలు దేవ! మ మ్మేలు నృహరి॥

*   *   *

సీ. అజ గజ రక్షక! అరి గణ శిక్షక!
అఖిల శుభావహా! అభయ కరణా!
సరసిరు హేక్షణా! దురిత నివారణా!
సురపతి గోపన! గరుడ గమన!

విబుధ జ నావన! వితత దయాఘన!
ఖల తతి నాశన! జలజ నయన!
ఫణిపతి విశ్రమ! పరభయ విక్రమ!
శ్రిత సుఖ వర్ధన! స్థిర సుఫలద!

గీ. సకల శుభకర! సుఖకర! సతత కరుణ!
నిఖిల భయ హర! భవ హర! నిరత ముదిత!
నిహత దితిసుత వితతి! సువిహిత కుశల!
మేలు లిడు మేలు దేవ! మ మ్మేలు నృహరి॥

* * *

సీ. బహు పుణ్య చయ గమ్య! మహిత ప్రభా రమ్య!
విహ గేంద్ర వాహన! అహిత దమన!
కమలాసతీ శ్రిత కమనీయ తమ వక్ష!
కమలాక్ష! శిక్షిత విమత పక్ష!
శరణార్థి వరణీయ చర ణాంబుజ ద్వయ!
కరు ణాబ్ధి! వరలభ్యసుర మహీజ!
విధు సుంద రానన! బుధ కోటి సురధేను!
మధుదై త్య సంహారి! మథితవై రి!

గీ. వ్యాప్త బాహ్యాంత రాజాండ భాండ జాల!
విదిత సర్వ జగ జ్జీవ హృదయ భావ!
శమిత నిజ భక్త హృత్తాప! శాంత పాప!
మేలు లిదు మేలు దేవ! మ మ్మేలు నృహరి॥

* * *

సీ. ప్రేమామృ తార్ణవ! హేమోజ్జ్వ లాంబర!
భీ మోరు విక్రమ! కోమ లాంగ!
దివ్యమంగళ నామ! భవ్య ద్యుతి స్తోమ!
అనుపమ కళ్యాణ గుణ సముద్ర!
ఇభరాజ రక్షణ! శుభరాజి వితరణ!
అభిమ తార్ధ విధాన! అభయ దాన!
సభయ త్రివిష్టప విభు పరిరక్షక!
విభవ సంతర్పిత త్రిభువ నార్థి!

గీ. శాంత సుస్వాంత సంతత చింతనీయ!
రక్షి తామర గణ! తామరస దళాక్ష!
శిక్షి తాశేష మత్త విపక్ష దైత్య!
మేలు లిదు మేలు దేవ! మ మ్మేలు నృహరి॥

* * *

సీ. దుర్మద దానవ నిర్మూల నోదిత!
వేద సంవేదిత! ఆది పురుష!
పూర్వ జన్మార్జి తాపూర్వ మహా తపః
పుణ్య సంచయ గమ్య! పూర్ణ పురుష!
దీన మానవ జన త్రాణ పరాయణ!
ప్రాణాధి కాప్త! పురాణ పురుష!
ప్రాను పైక శరణ్య! పురు షోత్తమ! వరేణ్య!
బ్రహ్మర్షి గణ సేవ్య! భవ్య పురుష!

గీ. పరమ పురు షార్థ సంధాయి! పురుష సింహ!
దృఢ మహా భక్తి గుణ వశ్య! దివ్యసింహ!
నాశి తాఖిల భ క్తాంహ! నారసింహ!
మేలు లిదు మేలు దేవ! మమ్మేలు నృహరి॥

* * *

సీ. ఇందు సుందర ముఖ! ఇందీవర శ్యామ!
ఇందిరా సుందరీ మంది రాంగ!
వందారు సజ్జన సందోహ మందార!
ఇంద్రా ది బృందార కేడ్య విభవ!

భానుకోటి శత ప్రభానిధి! ధీనిధి!
సుందర సురభిళ చంద నాక్త!
కారుణ్య పీయూష వారిధి! గుణ నిధి!
ఆనంద సంధాయి! దీన బంధు!

గీ. కంబు కమనీయ కంధర! కంబు హస్త!
భుక్తి ముక్తి ప్రదాయి! చిచ్ఛక్తి దాయి!
ప్రణత భీతి వినాశ! శీఘ్ర ప్రసన్న!
మేలు లిడు మేలు దేవ! మమ్మేలు శ్రీహరి!

* * *

సీ. చరణ సేవాసక్త హర విరించి సురేంద్ర
బుధ గురు రవి కవి ముఖ్య విబుధ!
వాత్సల్య పీయూష వర్షణ కృష్ణాభ్ర!
భక్త రక్షణ ధృత భవ్య దీక్ష!
అనుపమానంత దివ్యానంద సంధాయి!
అఖిల భోగ విధాయి! అభయ దాయి!
వామన! వన మాలి! పావన! పర మేశ!
మాధవ! మధు హారి! మధుర కరుణ!

గీ. సత్య ధర్మ వివర్ధన! నిత్య సత్య!
సచ్చిదానంద విగ్రహా! సచ్చరిత్ర!
సకల పాపౌఘ విధ్వంసి! సుకృత శంసి!
మేలు లిడు మేలు దేవ! మమ్మేలు నృహరి ॥

* * *

సీ. వాణీశ జిష్ణు శర్వాణీశ ముఖ్య గీ
ర్వాణాభివర్ణిత వర ప్రభావ!
లక్ష్మీ మనోహర లావణ్య లక్షిత!
దాక్షిణ్య గుణ పూర్ణ! దనుజ హరణ!
కుండల మండిత గండ యుగోజ్జ్వల!
మహనీయ సురుచిర మణి కిరీట!
సద యాభయ ద హస్త సర్వ సజ్జన శస్త!
నిఖిల సన్మంగళ నిలయ చరణ!

గీ. విశ్వ సర్జన రక్షణ విలయ మూల!
జన్మ మృత్యు జరా రోగ శమన కరుణ!
అఖిల తాపాపహరణ చరణాంఘ్రి కమల!
మేలు లిడు మేలు దేవ! మమ్మేలు నృహరి ॥

* * *

సీ. భవ దావ వహ్ని సంభవ తాప పరితప్త
జన మన శ్శాంతిదఘన పయోద !
శ్రిత జన పాతక క్షితిజ కంటక తతి
చ్ఛేదన నిపుణ నిశిత కుఠార !
దీన మానవ కోటి మానన గహ్వరా
జ్ఞా నాంధ్య నిరసన చండ కిరణ !
నిస్సీమ సంసార నీరధి నిర్మగ్న
నర సముత్కార సముత్తరణ తరణి !

గీ. భక్త చిత్తాబ్జ వికసన పద్మ బంధు !
వాంఛి తార్థ ప్రదాయక పారిజాత !
ఆత్మ సారూప్య వితర ణావ్యాజ కరుణ !
మేలు లిడు మేలు దేవ ! మమ్మేలు నృహరి ॥

* * *

సీ. హరిహాయ యమ వరు ణాద్యమ రావన !
వనజాస నోద్ధార వరద హస్త !
హస్త విరాజిత శస్త్ర సుదర్శన !
దర్శన చరి తార్థ తాపస గణ !

గణనీయ శ్రుతి సూక్త గణ గేయ వైభవ!
భవ తాప వారణ వారివాహా!
వాహన సత్కార సత్కృత ఖగ రాజ!
రాజస గుణ సుదుష్ప్రాప చరణ!

తే. చరణ సరసిజ స్మరణ సంసక్త భక్త!
భక్త దార్ఢ్య పరీక్ష ణాసక్త చిత్త!
చిత్త మరయక మమ్మోపేక్షింప మేలె!
మేలు లిడు మీలు దేవ! మమ్మేలు నృహరి!

* * *

సీ. సజ్జనా వన సింహా! సజ్జిత వన సింహా!
విద్వజ్జనానీక వేద్య సింహా!
తీక్ష్ణ దంష్ట్రా సింహా! దృప్త భీకర సింహా!
శిత వజ్ర నఖ సింహా! శ్రీ నృసింహా!
జయ దుష్ట గజ సింహా! జయ భీమ రణ సింహా!
జయ భద్ర గతి సింహా! జయ సుసింహా!
జయజయ వర సింహా! జయ జయ గిరిసింహా!
జయ జయ ఘనసింహా! సదయసింహా!

గీ. దురిత దితి సుత వితతి సంహరణ సింహ!
భావి భూత భవ ద్విశ్వ భరణ సింహ!
యోగి సద్భక్త తోష పీయూష లహరి!
మేలు లేదు మేలు దేవ! మమ్మేలు నృహరి॥

* * *

సీ. అతి తీక్ష్ణ దంష్ట్రాయ, శిత వజ్ర నఖరాయ,
దితి జాంతకాయ, దుష్కృత హరాయ,
శంఖ చక్ర గదాసి శార్ఙ్గ విలసితాయ,
శ్రీవత్స కౌస్తుభ శ్రీధరాయ,
భవ భయ నాశాయ, బహు పుణ్య ఫలదాయ,
భగవతే తే నమో భాస్వరాయ,
కృష్ణాయ తే నమో, జిష్ణవే తే నమో,
విష్ణవే ఽస్తు నమ, స్త్రివిక్రమాయ,

గీ. నారసింహాయ తే నమో, నర సఖాయ
అనుచు వినుతింతు మనిశమ్ము నమర సింహ!
అమర వాక్కులతోడ నిస్సమిత భక్తి
మేలు లేదు మేలు దేవ! మమ్మేలు నృహరి॥

* * *

క. వర హారయే, భవ హారయే,
కరుణా వరు ణాలయాయ, కమలా పతయే,
వర దైవతాయ భవతే
హారయే నిత్యం నమో అ టుందుము నృహరీ!

*　　*　　*

క. అంభోజ రుచిర నయనా!
అంభోజ భ వాది నుత పదాంభోజాతా!
అంభోజ భనాభ! అచ్యుత!
అంభో జాలయ హృదీశ! అఘహార! నృహరీ॥

*　　*　　*

క. కుక్షిస్థ నిఖిల భువనా!
వక్షస్థల ముగ్ధ దుగ్ధ వారిధి తనయా!
పక్షీంద్ర ప్రియ వాహన!
అక్షీకృత వహ్ని రవి హిమాంశూ! నృహరీ॥

*　　*　　*

క. జయ శ్రీమన్నర కేసరి!
జయ భక్త క్లేశ హారి! సమ్మోద కారీ!
జయ దుష్ట హృద్విదారీ!
జయ సుజన మనో విహారి! జయ జయ నృహరీ॥

— 0 —



# నరసింహ కర్ణామృతము

## ౮. నివేదన విందువు :

శ్లో. నివేదయే నృసింహాయ
సజ్జ నార్తి నివారిణే!
దయామృ తాబ్ధయే తుభ్యం
మదీయం హృద యాంబుజమ్ ॥

* * *

సీ. అక్షతల్ "రత్న సింహాసన" మ్మని చల్లి
నీ పూజ నొనరింప నేర్చువాడ;
పత్రమ్ము నొసగి "యాభరణమ్ము" నీ కని
పలుకుచు సంతోష పడెడు వాడ,
నొక పుష్ప మిడుచు "రా జోపచారమ్ము" గా
వించితి నని సంతసించు వాడ,
"నమృత మ" ని తలచి చాడు నన్నమున్ గొంచక
నీకు నివేదింప నేర్చినాడ;

క. నిపుడు "కర్ణామృతమ్ము" నీ కిది యటంచు
పలుకుచుంటిని మదిలోని భావములను,
భక్తినే యెంచి మన్నించు ప్రభు డవంచు,
మేలు లిడు మేలు దేవ! మ మ్మేలు నృహరి॥

* * *

ఆ. దివ్య సుందర! యిదె శ్రీవ్య సత్పద గతిన్
బ్రకట భక్తి వినత మకుట పంక్తి
నాట వెలదు లమిత హర్షాన నిను గొల్చు
దీన సుజన బంధు శ్రీనృసింహ॥

* * *

సీ. సీసాల నిండ నీ సేవకై కూర్చితి
మన్మానస లతాంత మధు రసమ్ము;
సౌందర్య నిలయ! ఆనంద శేవధి! రస
జగతీ మహారాజ్య సార్వభౌమ!
లలిత పదాస్య విలాస లాస్యల "నాట
వెలదుల" నీకు నర్పించి యుంటి;
విందుగా కూర్చితిన్ "కందముల్" మాకంద
మధురముల్ సౌవర్ణ మహిత రుచులు;

క. శ్రీ రమా ప్రేమ మందిర; కోరి నీదు
మానసమ్మున నుల్లాస మా నటించు
చేయు మా సేవలను కృప స్వీకరింపు
మేలు లిడు మేలు దేవ! మమ్మేలు నృహరి ॥

* * *

ఆ. కోటి భాను తేజ! సాటి చెప్పగ నీకు
చూపుచుంటి చిన్ని దీప మొకటి;
చపలు, నజ్ఞు, నన్ను క్షమియించు కృపఁ జూపి
దీన సుజన బంధు! శ్రీ నృసింహ ॥

* * *

ఆ. అల్ప శక్తి తోడ అలతి మాటలు గూర్చి
భవ దనంత మహిమ పలుకు చుంటి;
చిన్ని దివ్వెచూప, వెన్నెధి గనరాదె!
దీన సుజన బంధు! శ్రీ నృసింహ ॥

* * *

ఆ. మా మనమ్ము దనియ, మా శక్తి మేరకు
నీకు నామ రూప నియతి గూర్తు,
మింతే; నీదు రూపు నెఱుగ మా కలవియే!
దీన సుజన బంధు! శ్రీ నృసింహ ॥

ఆ. చాల చదివి యుంటి; చాలగా విని యుంటి;
సత్య మెఱుక యయ్యె; శంక తొలఁగె;
నిన్ను నమ్ముకొనుటె నిజమైన జ్ఞానమా;
దీన సుజన బంధు। శ్రీ నృసింహా ॥

* * *

క. శక్తుడనే! యని జంకక
భక్తుల మది నుండు మధుర భావమ్ములనే
స్వోక్తుల నిటు దెలఁపగ ను
ద్యుక్తుడ; ఈ సాహసమ్ము నోర్చుము నృహరీ ॥

* * *

క. తీవల నున్న సుమమ్ముల
నేవిధి మాలికలు గూర్చ మృదుత తొలగునో;
ఆవిధి మది మధు రోహాలు,
నీవలి మాటలను చప్పనే యగు నృహరీ ॥

* * *

క. చప్పని మాటలె యైనను
ఒప్పగు నీ మధుర నామ యుక్త మ్మైనన్,
తప్పక శ్రావ్యము లగు నని
చెప్పెద, కృపఁ జిత్తగింపు శ్రితబుధ! నృహరీ ॥

క. అంజనసుత వీరులు దోయిలి
యంజన ధరియించి మోద మందెడి యటు లా
నందింతును నీ ఘనతర
సుందర విభవములు దెలుపుచున్ ప్రభు! నృహరీ॥

* * *

క. ఎన్నో కోయని తలపులు,
ఎన్నో వెత, లెన్నో కతలు; నెన్నో శంకల్,
ఎన్నో నీపయి నేరము,
లన్ని యికన్ విన్నవింతు నరయుమి! నృహరీ॥

* * *

క. అరసి నామదిని నీవే
కరుణింపగ, వినగ, మెచ్చగా దక్షుడవా
గోరవని నా హృదయము నీ
చరణ సరోజముల నిడుము స్వామీ! నృహరీ॥

* * *

క. నా కష్టము లన్నిట నీ
వే కారణ మనుచు పలికి తృప్తింగనెదన్;
నా కర్మ ఫలము లివి యని
నీకానగ దెలుప కయ్యె, శ్రీశా! నృహరీ॥

క. నా పాతకముల చింతిల్లను,
నీ నాందెద పపయశమ్ము; నీ సద్భక్తుం
డీవిధి వ్యథలం గుందగ
కావగ లే నైతి వంద్రు గదె నిను ! నృహరీ ॥

* * *

క. ప్రియమగుత నాకు లోకము,
ప్రియుడ న్నే నగుత జగతి విబుధుల కెల్లన్,
భయమును, ద్వేషమ్ము ననూ
యయు లేనిది యగుత నాదు స్వాంతము నృహరీ ॥

* * *

క. నాకేమి కలుగు లాభ?
మ్మాకష్టము నొందనేల ! యిప్పు డనకుండన్,
లోకమునకు చేయుదు మే
లేకొంచెము! అనదగాక యెప్పుడున్ నృహరీ ॥

* * *

క. కోరుదు నీకథలన్ వినఁ;
గోరుదు నీభక్త గణము కూర్మిన యెప్పుడున్;
పోరుదు దుర్వాంఛలతోఁ;
జేరగ లేకుండు నెట్లు నిన్నిక! నృహరీ॥

—:0:—

## 6. దయాభ్యర్థన పంచుపు

శ్లో. రక్షి తాఖిల లోకస్య
శిక్షిత క్రూర రక్షసః,
అక్షీణ కరుణా రాశేః
నృహరేః ప్రార్థయే దయామ్ ।

* * *

ఆ. వేగ నుద్ధరింపు వేదములన్ వలె,
మందరాద్రి నట్లు, మహిని వలెనె,
దైత్య సుతుని రీతి, దాసుని నను గూడ
దీన సుజన బంధు । శ్రీ నృసింహ ॥

* * *

ఆ. అగణిత జనన మరణాస క్త తతిలోన
చిక్కి. త్రిప్పలంబడి, స్రుక్కు దీన
జనుల నుద్ధరింప సమవలంబము నీవె
దీన సుజన బంధు । శ్రీ నృసింహ ॥

* * *

ఆ, నిండు భక్తితోడ నిను గొల్చు భాగ్యమ్ము,
నిను స్మరించి పొందు నిండు మోద
మొప్పు దు నిండుగ నిమ్ము, మితరము వలదు లే
దీన సుజన బంధు! శ్రీ నృసింహ॥

ఆ. నిన్ను మఱవ జేయు నన్న నే గోరను
ఎట్టి వైభవమ్ము, నెట్టి సుఖము;
నీ స్మరణమె నాకు నిఖిల భోగమ్ములు
దీన సుజన బంధు! శ్రీ నృసింహ ॥

* * *

ఆ. కఠిన మణిని మృదుల కమలతో సమముగా
ఎదను జేర్చుకొన్న సదయమూర్తి!
ఖలుడ ననుచు నన్ను గావ శంకింతువే!
దీన సుజన బంధు! శ్రీ నృసింహ ॥

* * *

ఆ. నీకు ప్రీతి గూర్ప నేరని కార్యముల్
బుధ జనార్తి హేతువులగు పనులు
సలుప కుండు నటులు స్వామి! నన్ శిక్షింపు
దీన సుజన బంధు! శ్రీ నృసింహ ॥

* * *

ఆ. మంచి, చెడ్డ—రెండు మహి నుండ నందలి
చెడున మెంచి ఆోత చెందు మనసు;
మంచి నెంచినేర్ప మా కొసంగుము సామి!
దీన సుజన బంధు! శ్రీ నృసింహ ॥

ఆ. మద, విరోధ, మోహ, మాత్సర్య కామముల్
మదిని గ్రమ్ము లొక్కు మమ్ము నొంచు;
కాత వజ్ర నఖర! స్వామి! చీల్పవే వాని!
దీన సుజన బంధు! శ్రీ నృసింహ ॥

* * *

ఆ. మాదు ప్రజ్ఞ, బలము, మా వైభవము లన్ని
నీ యనుగ్రహమున నే యటంచు
మా మది గ్రహియించి మద మొందకుండుతన్
దీన సుజన బంధు శ్రీ నృసింహ ॥

* * *

ఆ. నిను భజించుచున్న నేటి మా భాగ్యము
జన్మాల జన్మ సుకృత ఫలిత మనుచు
తెలిసి దాని నెపుడు నిలుపు కొందుము గాక !
దీన సుజన బంధు! శ్రీ నృసింహ ॥

* * *

ఆ. మాదు దృష్టి విచలి లోక సూతన; లైన,
మాదు మానస, మది మాత్ర మెపుడు
నిలచి యుండు గాక నీ యంఘ్రి యుగ మందె
దీన సుజన బంధు! శ్రీ నృసింహ ॥

ఆ. తప్ప దంపు రాపదలు కొన్ని నరులకు;
కాని ఆయిదుమలలోన జిక్కి-
నిన్ను నన్ను నేను నిందింప నట చూడు
దీన సుజన బంధు! శ్రీ నృసింహ॥

*　　*　　*

సీ. మా కబ్బె దుర్లభ మానవ దేహమ్ము
　　నిరుపమమ్మైన నీ కరుణచేత;
నీ కృప చేతనే మా కబ్బె నెప్పుడు
　　నిను గూర్చి తపియించు నిష్ఠ మాకు;
మఱి యిక నెన్నడున్ మా మనమ్ముల నన్య
　　చింతలు వంతలున్ జేరకుండ,
నిన్ను సేవింపగ, నీ ధ్యాన మొనరింప
　　నొక్కింత యాతంక మొదవకుండ

గీ. భవ సుఖమ్ముల కొఱకునై భ్రమయకుండ
సుస్థిర శ్రద్ధ, దృఢభక్తి చొప్పడంగ
నీవె మా మది యందున నిలచియుండి
మేలు మార్గము చూపి! మ మ్మేలుం నృహరి॥

సీ. నిన్ను మనసునందు నిలుపుకో గల్గిన
నరు డెట్టి చింతల నవయ బోడు;
నిన్ను దృఢభక్తి ధ్యానించెడి యాతడు
చెడిపోవ డెంతటి యిడుమలందు;
ఇంచుక నిను గ్రహియించు నాతడు శాశ్వ
తా నంద మార్గమ్ము నరయ గలడు;
నిన్ను స్మరించుచు నిర్మల మతి నున్న
యతడె నీ కరుణకు పాత్రు డగును;

గీ. నీదు కరుణకు పాత్రమై నెగడెనేని
వాని కెవ్వారు సాటిరావారు జగతి!
ఇల సుఖ మ్మెల్ల వానికి తృణ కణమ్మె!
మేలు లిడు మేలు దేవ! మ మ్మేలు నృహరి!

* * *

సీ. చెవులార విని మెద శ్రీనాథ! నీకథల
నా కర్ణములకు ధన్యత లభింప;
నోరార కీర్తింతు నారదనుత! నిన్ను
నాదు వాక్కునకు మాన్యత ఘటిల్ల;

కనులారఁ దిలకింతుఁ గమలాక్ష ! నీమూర్తి
నా నేత్రయుగము గణ్యమ్ము గాఁగ;
చేతులారఁ ద్వ దంఘ్రి సేవ సేసెద నాదు
పాణి యుగ్మమ్ము సాఫల్య మొంద;

ఆ. తనువు ముదమున రోమ హర్షణము నొంద
మనసు నీ స్మరణమ్మున మత్తిలంగ
నిన్ను జింతించు భాగ్యమ్ము నిల్పి యుంచు
మేలు లిడు మేలు దేవ ! మమ్మేలు నృహరి ॥

* * *

సీ. అధికమా ప్రజ్ఞల నార్జించు కొలదియు
వినయమ్మె మా మది వృద్ధి యగుత:
ఎంతగ సంపదల్ హెచ్చుచు నున్నను
నెఱపు చుందుముగాక నీతి సరణి;
ఉన్నతోన్నత పద మ్మొదవు చున్న కొలంది
తోడ్పడుదుముగాక దుర్బలులకు;
కండ బలమ్మెంత యుండినన్ మాకది
కల్గింప కుండుత కావరమ్ము;

గీ. నీదు సత్కృప మాపయి నెగడు చుండ
వసుధ యెల్లను నీకుటుంబమ్మె యనుచు
పరలుమముగాళ ప్రేమైళవర్తనమున
మేలు లిడు మేలు దేవ! మమ్మేలు నృహరి॥

* * *

సీ. మా యఘమ్ముల బాపి, మా యాంధ్య ముడిగించి
చిరత రానంద సత్సరణి చూపు;
నీకృప గోరుచు నిను స్మరియింతుము
మా మది వసియించి మమ్ము నడుపు;
మానస మందున మహి నెల్ల యెడలను
నిన్నె గన్గొను భాగ్యమ్ము నెమ్మి నొసగు;
భక్తార్తి నోదన! పరమ దయానిధి!
సర్వలోక మహేశ! సర్వ శరణ!

గీ. నిరుప మానంద సేవధి! నీదు పదము
నెట్టకేలకు పట్టితి; మింక నెపుడు
నెట్టి శంకలు మామది నెనయనీకు
మేలు మార్గమ్ము చూపి మ మ్మేలు నృహరి॥

క. ఎవ్వని కృపచే మూగయు
మవ్వపు వక్తృత్వ మొందు; మఱి కుంటియు దా
నవ్వడిఁ గొండలు దాటునొ,
అవ్వరదుని నిను భుజింతు మనిశము నృహరీ॥

* * *

క. నరసింహా ! శక్తి నొసగుమి,
అరుదుగ సింహమ్ము వలెన అసహాయతకున్
వెఱవక చింతా శంకల
నెఱుగక మద్విధుల విక్రమింపగ నృహరీ॥

* * *

క, నను జూడు భక్తుఁ బ్రహ్లా
దుని జూచిన ప్రేమ దృష్టితో, మదఘౌఘ
మ్మును జూడు ముగ్రదృష్టిన్,
గనినట్లుగ నాహిరణ్యకశిపుని నృహరీ॥

* * *

క. నీకృపకు పాత్రమైనన్
మాకున్న బలమ్ము లోకమాన్యమ్మె యగున్,
కాకున్న పశుబలమ్మొ
లోకాహిత దైత్య బలమొ యూహిగ నృహరీ॥

క. మాదు మనోమయ జగమున
నీదయ యను దివ్య దీప్తి నెలకొన మమున్
మోదమున బాహ్య జగతిన్
వేదనలను తమము నణప నే ర్తుము నృహరీ॥

* * *

క. ప్రీతి పర తోషణమ్మున,
భీతి పరప్రాణి కెపుడుఁ బీడ యొనర్పన్,
ఆూత పరదూషణమునన్
రీతులగున్ మాకుఁ బడయ నీకృప నృహరీ॥

* * *

క. అడచి పశు గుణము స్వార్థము,
విడచియు రాక్షస గుణమ్ము పీడా పరతన్,
నడపుచు మానవ హితమును
బడయంగోరెదము నీదు వరకృప నృహరీ॥

* * *

క. కోరికలవి మమ్మేచగ,
కోరగ వచ్చియును జిన్న కోరికలను నిన్
గోరుట యుక్తము గాదని
కోరెద మెన లేని నీదు గురుకృప నృహరీ॥

క. కమలాక్ష! గాంతు నిను నా
అమలిన హృన్ముకురమందు ననిశమ్ముఁ గుత
ర్కము లనియెడు దుర్మాలి
న్యములన్ జెడకుండ దాని నరయుమి నృహరీ॥

* * *

క. పొందునట నీదు భక్తుడు
ముందుగ కష్టముల నెన్నో; పొందితి నెల్లన్;
చిందించి దయామృత మ్మిక
క్రందుగ సౌఖ్యముల నొసగు ప్రభు! శ్రీనృహరీ॥

* * *

క. ఆర్తిం జెందిన యప్పుడె
కీర్తించు నితం డను నపకీర్తిని సైచన్
గుర్తుగ సంపద లిడు; నిన్
గీర్తింతునో లేదో గనుము నీవే నృహరీ॥

* * *

క. మంచిని జూచెడి నేర్పును
మంచిని గావించు శక్తి మంచిగ నాలో
చించెడి సద్బుద్ధిని నీ
అంచిత కృప నొసగు మయ్యా అనిశము నృహరీ॥

క. తెలిసియుఁ దెలియక చేసిన
పలు రీతుల చెట్ట పనులు, పాపపు చింతల్
తలచి ఖలు డనుచు ద్రోయకు;
తలపుము నిను వేడు నాడు తలపున నృహరీ॥

* * *

క. దేవ! దయసేయుమా, యిలఁ
దావశమా సేవ గానె దలచుచు దయనీ
యా వస్థ నున్న జనులను
సేవించి సుఖింపఁ జేయు చింతను నృహరీ॥

* * *

క. భోగములన్ సంయమమును,
త్యాగమునన్ సాహసమ్ము ధైర్యము చాలం
గాగల్గి జడ్ధితమ్ముగ
సాగన్ మా జీవ యాత్ర సాకుము నృహరీ॥

* * *

క. స్వామీ! ప్రేమాబ్ధీ! నీ
నామ స్మరణమున, నీ గుణ ప్రస్తుతిచేన్
మా మదియు మాదు వాక్కును
వైమల్యము నొంది ఘనత వడయుత నృహరీ॥

—: 0 :—

## 7॥ అజ్ఞాన నిరసన బిందువు

శ్లో. అజ్ఞాన హారీ నృహరిః
దుర్మోహాంధ తమో రవిః!
దుశ్చింతారణ్య దావాగ్నిః
దుర్మద క్షోణిభృత్పవిః॥

* * *

ఆ. తెలియు మాదు తనువు జలబుద్బుదమ్మని,
సకల జనుల కీవు శరణ మనియు;
నయిన నిన్ను గొలువ నలసతయే మాకు
దీన సుజన బంధు। శ్రీ నృసింహా॥

* * *

ఆ. ఇదియె చేయదగిన, దిది చేయదగని దా
ననుచు లోన తెలిసి కొనియు గూడ
వీడ జాల మకట! ప్రీడావ హోఘముల్
దీన సుజన బంధు శ్రీ నృసింహా॥

* * *

ఆ. ఇతరు లిడుము లొంద నెట్టి వారల కివి
అవనిఁ దప్పునే అని యనెద నాకె
చిన్న ముల్లు గ్రుచ్చుకొన్న, ;దూఱుదు విధిన్
దీన సుజన బంధు। శ్రీ నృసింహా॥

ఆ. అర్థితమ్ము దీఱ నాలస్య మైనంత,
నిన్ను నామనమ్ము నింద సేయు;
స్థితి గలుగ, పిదప సిగ్గిలు నది దేవ!
దీన సుజన బంధు! శ్రీ నృసింహ ॥

* * *

ఆ. కోర్కె తీర్చ మేలు గూర్తు వాకోర్కెల మాఱు,
కూర్తు వాకటల మేలు కోర్కె చెఱచి;
మాకు మొదట తెలియ రాకుండు నీయిచ్ఛ
దీన సుజన బంధు! శ్రీ నృసింహ ॥

* * *

ఆ. తెలిసి నట్టు లుండు; తిరిగి అజ్ఞేయ మై
యగుచు నుండు నీ యథార్ధ తత్త్వ,
మెఱుగ వశమె? నీవు గరుణఁ జూపక యున్న
దీన సుజన బంధు! శ్రీ నృసింహ ॥

* * *

ఆ. వెనుక దినము లందు, వెనుక జన్మము లందు,
దురితపు పను లెన్నొ తొడరి చేసి,
నృహరిఁ దలచు నాకు నిడుములా? యనుచుందు
దీన సుజన బంధు! శ్రీ నృసింహ ॥

ఆ. ఆది వేద ఋషులు, వ్యాస వాల్మీకులు,
శాస్త్ర భాష్య కార శంక రాదు
లెన్నొ మాట చెప్పి; రెఱుగు భాగ్యము నిడు!
దీన సుజన బంధు ! శ్రీ నృసింహ ॥

* * *

ఆ. పాలను గొనిపోవ జాలు మోయుగ వలె!
ననెడి లోకరీతి నరయ కుండ
జాలు మోయగ నొల్ల; పాలె కావలెనందు
దీన సుజన బంధు ! శ్రీ నృసింహ ॥

* * *

ఆ. ఎదుట నిలచి నన్ను నిదుర లేపిన నేను
కనుల దెఱవ, చెదరుఁ గల యటంచు;
నీవు వెడల, లేచి నీకయి వెదకుదున్
దీన సుజన బంధు ! శ్రీ నృసింహ ॥

* * *

ఆ. దివ్య సౌధ మొసగి దీనిలో వసియింపు
మనగ నాడు లోభ మావహిల్లు;
ఇంక నాదు గుడిసె ఏ యమ్మ్యాలకో యంచు
దీన సుజన బంధు ! శ్రీ నృసింహ ॥

ఆ. కోరి నీదు కరుణ కోట్లు వెచ్చింతురు
భక్తగణము; నాకు భయము గలుగు-
సిఱు కాసు నొసగ నాకు లోటగునంచు
దీన సుజన బంధు! శ్రీ నృసింహా॥

* * *

ఆ. పడయఁ గోరుచుండు బ్రహ్మాదు డాదిగా
గలుగు భక్తకోటి గనిన ఫలము;
నీవు కట్టినంత చెపరు ఈమది యిట్టె!
దీన సుజన బంధు! శ్రీ నృసింహా॥

* * *

సీ. ఎంతగ గడించిన నంతయు నణగదు
విత్తమ్ముపై ఆస చిత్తమందు;
ఎంతగఁ జదివిన నెంత విన్నను గాని
శంకలు దీఱవు స్వాంతమందు;
ఎన్నెన్ని ప్రబడికేన, నెంత సుఖించినన్:
మోహమ్ము తొలగదు దేహమందు;
ఎన్నడెఁ బొగడిన, నెన్నిరణమ్ములన్
గెల్చిన నుడుగదు కీర్తికాంక్ష;

గీ. లోక సుఖ సంపదల యందు లోభ మణఁగఁ
జేయలేకున్నఁ గల్గునే చిత్తశాంతి!
శాంతి హీనుడు నిన్ గనఁ జాలు నెట్లు?
మేలు లిడు కీలు దేవ! మ మ్మేలు నృహరి॥

* * *

సీ. అంతలో గర్వియౌ, నంతలో నిస్పృహాం
డత్యాశలకు లోగు నంతలోనె;
అంతలో నాసక్తు డంతలోనె విరక్తు
డంతలో క్రోధితుండగుచు నుండు;
ఛాందసుండొక్కచో, సంస్కారి యొక్కచో
నంతరంగమ్మున నతడెవండొ?
ప్రేమించు నిన్నను, ద్వేషించు నీనాడె!
ఎయ్యది నిత్యమో యెఱుగరాదు;

గీ. క్షణిక మగు బ్రదు కిందు కు శంక లెన్నొ!
భ్రమను లెన్నియొ! అన్నిటిఁ బారఁ ద్రోలి
శాశ్వతానంద పదమును జక్క నెఱుగు
మేలు మార్గమ్ము చూపి! మమ్మేలు నృహరి॥

సీ. గురువు లజ్ఞానంపు సరణి నున్నారని
శిష్యుల కొంతయు చింత గలుగు;
వైద్యుండు తన వ్యాధి పరిశీలనమ్మున
పొరవడెనని రోగి వెఱపు నొందు;
నాయకుల్ స్వార్థ పరాయణులే యని
ప్రజలకు మిగుల నారాట మొదవు;
యజమాని తన శ్రమ నరయజాలడటంచు
సేవకుం డెంతయుఁ జెందుఁగలత;

గీ. ఎల్ల రజ్ఞానులును, శక్తిహీను, లైన
నెదుటి వారల వలననే యెల్ల బాధ
లొదవు మాకని వాపోవు చుందు రెపుడు,
మేలు మార్గమ్ము చూపి మమ్మేలు నృహరి॥

* * *

సీ. నీ సృష్టి నొక గణనీయ సౌందర్యమ్ము
గన్గొని మురియుచు గర్వపడుచు
సౌందర్య నిలయ! నీ సుందర రూపమ్ము
భావింప నోపని పామరులము!

నీవొసంగిన తెల్వి నెఱపుచు భువి మాకు
సాటివే లేరని చాటుకొనుచు,
జ్ఞాన మూలమైన నీ నిజ తత్త్వమ్ము
మది నెఱుంగని మంద మతుల మకట!

సీ. ధరణి జీవుల నడపు చైతన్యమునకు,
విశ్వ మరయంగఁ జేయు నీ వెల్గులకును,
నీవె కద! మూల మనియెడి యెఱుక గలుగ
మేలు మార్గమ్ముచూపి మమ్మేలు నృహరి.

* * *

సీ. లేని వా డితడన్న లెక్క సేయగ నేల?
కల మానవత్వమ్ము నిలుపు కొనిన!
అల్పజ్ఞు డితడన్న వ్యధ నొందగా నేల?
నిను గూర్చి తెలియగా నేర్చుకొన్న!
ఘనకార్యములు సల్పగా లేదనగ నేల?
అన్యాయ వర్తన మ్మంటకున్న!
అలయోగి జన సేవ లబ్బ లేదన నేల?
దుర్వ్యసనుల త్రోవ త్రొక్క కున్న!

తే. దూర మైనట్టి ఘనతలఁ గోర నేల?
చెంతఁ గల మంచి పెంచెడి చిత్త మున్న!
ఇరవు సుఖ దుఃఖముల కెల్ల నెదయె గాదె!
మేలు మార్గమ్ము చూపి మమ్మేలు నృహరి॥

* * *

సీ. ప్రాతది యన్నంతనే తగ్గె మూల్యము,
క్రొత్త దన్నను గాని; కోర రాదు!
పరిచితు లైనంత గురుత గోల్పోదురు;
నూతను లే మాకనూన ఘనులు;
మా వేష భాషలే మాకు మోట య్యెను
మా దేశమన భక్తి మాకె తగ్గె;
పర దేశ పర వేష పర భాషలే యెందు
గౌరవా వహమాయె నౌర మాకు

తే. మేము స్వయముగ నెంచుట మెచ్చుట యను
లేక, పూనుచు నుంటిమి లోక మెపుడు
జేసి మెచ్చుచు నుండు, నద్దాని నెంచి
మేలు మార్గమ్ము చూపి మమ్మేలు నృహరి॥

సీ. శాంతము సహన మశక్తుల కర్మముల్
ధార్ష్ట్యమె ప్రజ్ఞకుఁ దారకాణ:
సత్య మహింసయు ఛాందస పద్ధతుల్
స్వార్థ సాధనమె యాఁ బౌరుషమ్ము;
పాపము దైవము భయపెట్టుచుండును
బలహీనులనె, యని తెలివి తోఁడ,
పరులకు బోధించు కొఱకునై యనిశమ్ము
ధర్మము నాల్కపైఁ దాండవింప

గీ. బ్రదుకు దెరువుగాఁ దలచిన పనుల నెల్ల
జంకు గొంకులుం లేకుండఁ జలుపకున్న
బ్రదుక శక్యమె? యిల నను భ్రాంతి బాపి
మేలు మార్గమ్ము చూపి మమ్మేలు నృహరిః

* * *

సీ. లక్షణంబుగ మాకు లక్షల విలువైన
మనుజ జన్మము గల్గ మనగ లేక
వీసము లాభము నాసించి పశువుగా
మాఱుచు నుందు పామరు లమకట !

సజ్జన బృందమున్, సన్మిత్ర వర్గమున్
బూని స్వార్థమునకై మోసగించి
నీ కృప వడయగా, నీ క్రోధ మెడలగా
నీకు మ్రొక్కుచు నుందు నేర్పరులము!

సీ. మాదు తెలివిని, బలమును, మాదు ధనము
నొరుల మాయింప నొంచగ నెఱపు మేము
కోరి నీకృపఁ బడయ యోగ్యులమె? స్వామి!
మేలు మార్గమ్ము చూపి! మమ్మేలు నృహరి!

* * *

క. అంతకును నీవె! యనుచు ర
వంత యనిష్టమ్ము గలుగ నడలుచు నుందున్,
నంత కృషి ఫలింపగ, నా
యంతటి వాడవని! గలడె? యందును నృహరీ!

* * *

క. మంచి వగు చిన్న పను లొన
రించుచు నేనాసతోడ నెంచెద, నేఁగా
వించిన పెను దోసమ్ముల
నెంచక మన్నింతు వనుచు నెంతయు నృహరీ!

క. నిన్నటి వఱకిటు దలచితి!
"బిన్నను, నేన ట్లొనర్తుఁ బెద్దల పనులన్?"
ఎన్నఁగ నేఁడిటు తోఁచును-
చిన్నది వయ సిప్పుడేమి సాధ్యము? నృహరీ!

* * *

క. కష్టము నిను గూర్చియు, నీ
సృష్టిం గూఱిచియు నెఱుఁగ నెంతయు ననగా
స్పష్టముగఁ దెలిసె నాకిటఁ
గష్టమె నన్నైనఁ దెలియగా నని నృహరీ!

* * *

క. ఓ యయ్యా! లోక మిది య
న్యాయమ్ముల పుట్ట యయ్యె నని చింతిలుదున్;
నా యవియు నెన్ని యుండునొ!
ఆ యన్యాయముల, ననుచు నరయను నృహరీ!

* * *

క. కానఁగ రావట నీవెట,
నా నమ్మిక లేని తమ్మునకు నిల; నీ
యానయె మా యన్నను మఱి!
యేనాడును నడుపు నంట! ఎయ్యెడ నృహరీ!

క. నా కంటె శక్తిహీనుల
కే కష్టము లేక సుఖము లేలనొ? అనెదన్;
నా కన్న శతాధిక బలు
తే, కష్టము లొందఁ, దలప నింతయు నృహరీ॥

* * *

క. ఒసగితివి గ్రుడ్డి గుడ్డము!
విసువున నేనిపుడు దాని విడువం జోవన్,
కసరు న్నన్నొక; డొకడిక
హసియించున్ బ్రేమఁ జూతు ననుచున్ నృహరీ॥

* * *

క. ఒక మాటయె, ఒక పాటయె,
ఒక సుమమే అమిత మోద మొసగు నొకనికిన్,
ఒక డెచటను నీ జగతిని
అకటా! ముద మనగ గలడె? యనుజూమి నృహరీ॥

* * *

క. ఎన్నగ నీ జగతి నెటన్
గన్నను చీకటులె యనుచు నా మిత్రునితో
నన్న, వినెనేమొ! జాబిలి
నన్నువిలోకించి మింట నవ్వెను నృహరీ॥

క. ఊఱకలు వైచెద మది భూ
పరిధులు వేదాటి నింగి భ్రమణ మొనర్పన్;
మఱి! నేల నడుమఁ దడబడు
చరణమ్ముల గతిని గాంచఁ జాలను నృహరీ!॥

* * *

క. తెలిసె ననుకొంటి నెన్నియొ!
తెలిసె న్నేటికి నిజమ్ము; తెలియగ గోరన్
భళి! యీ విశ్వమ్మును నీ
వలె నాంత, మెఱుంగినది రవంతయొ! నృహరీ॥

* * *

క. వ్యక్తమయి యొక్కచో, న
వ్యక్తమ్మయి యొక్కచోట వరలున్, నీదా
శక్తియు, నిచ్ఛయుఁ; బరిమిత
శక్తులమా మా కెఱుంగ శక్యమె! నృహరీ॥

* * *

క. అజ్ఞతను దాచుకొని స
ర్వజ్ఞుడుగాఁ దోప నరుడు పచరించును తాన్
ప్రజ్ఞా వాదమ్ముల; న
ల్పజ్ఞత దోసగొనె? మర్త్యులకు భువి నృహరీ!॥

క. ఎవ్వడట తాను నిన్నను!
ఎవ్వండో తెవుమఱల నేమగునో! తా
నివ్వేళను సర్వజ్ఞుడ నన
నవ్వారె కని గర్వపరుని నరునిన్ నృహరీ॥

* * *

క. ధరణి నివి యెంత సుఖమో!
అరయన్ పరనింద మఱియు నాత్మ స్తుతియున్;
నరుడొల్ల ననుచునే తా
మఱి మఱి యొనరించు వీని మానక నృహరీ॥

* * *

క. మెచ్చగ వలసిన గుణములు
హెచ్చుగ విలసిల్లుచుండ నెంచక, తనకున్
నచ్చని యొక గుణ మెంచుచు
సచ్చరితుని నిందసేయు జడమతి నృహరీ॥

* * *

క. నచ్చునది యెంచి చెప్పిన
అచ్చతురుని గాంచి భక్తి నచ్చింతు; మికన్
నొచ్చిన మామది మెత్తుమె?
అచ్చతురానను పలుకులైనను నృహరీ॥

క. ఇష్టముగు పనిని దుష్టము
కష్టము, నష్టమ్ము లనక గావింతుము; మా
కిష్టమ్ము లేని పనిలో
సృష్టింగల బాధలన్ని యేర్పడు నృహరీ॥

* * *

క. వీసమొక పని నొకండెటొ
చేసి పరుల్ మెచ్చరనుచు చింతిలుచుండున్;
వేసరక చేయు కత మొక,
డాసింపడు సుంత మెప్పు నందగ నృహరీ॥

* * *

క. పరులకు గలిగిన విజయము
నరయుచు భావించుఁ దనకు నపజయముగ నేఁ;
ఒరు లపజయ మొందిన, ఘన
తర జయముగ నెంచుఁ గూళ తనకది నృహరీ॥

* * *

క. అలరుదు రొక్క క్షణమ్మున;
అలుగుదు రింకొక్క క్షణము నందే అకటా!
చలచిత్తు లొసగు మన్నన-
గొలుపదు సంతసము భయమె గొల్పును నృహరీ॥

క, లోకులను దోచుకొనుచు నె
లోకులకుం దోచు నొకడు లోకాప్తుడుగా;
లోకులచే దోచంబడి
వాకొనబడు నొకడు లోకవైరిగ నృహరీ॥

* * *

క. పురుషోత్తమ! ఈ జగమున
నరుడుత్తమ సృష్టియంట! నరుడే మఱలన్
ధరణిన్ ఘోర విపత్తుల,
వెఱవక సృజియించు వంట విడువక నృహరీ॥

* * *

క. కల్పనల తోడ జగతి క
నల్పాభ్యుదయమ్ము సేయు నరుడే; మఱలన్
గల్పనలు చేసికొనుచు న
నల్ప భయమ్మొందు నదియు నరుడే నృహరీ॥

* * *

క. నీ వొసగిన దేహము దుః
ఖావాసమ్మనుచు దాని నజ్ఞత నిందల్
గావించు ప్రాణి నరుడే;
జీవించుం బ్రీతి సర్వజీవులు నృహరీ॥

క. ధర సర్వ ప్రాణులకును
  దొరకక పంచేంద్రియముల తుష్టి గడింపన్
  దొరలాడ, దూరమాయెను
  నరగమ్యంబౌ దివ్యసుఖము నరులకె నృహరీ॥

—: 0 :—

## 8. సుజన ప్రశస్తి బిందువు

శ్లో. హరి ర్వైకుంఠ సదనే,
  యోగి హృన్మందిరే హరిః।
  హరి శ్శ్రేష్ఠేషు సర్వేషు,
  సద్భక్తే, సజ్జనే హరిః॥

*   *   *

ఆ. "నరుడ" నీవు మదిని పదిలమై యుండగా,
  నరులు తమదు పనులు పరహితముగ;
  నరుడు మెచ్చ బ్రదుకు వారట సజ్జనుల్
  దీన సుజన బంధు! శ్రీ నృసింహా॥

ఆ. దీనులం దెవండు దీన వత్సలు నిన్ను
జూడ గలుగు, నతడె సుజను డనగ;
భక్తు డనగ నతడె పడయును నీకృపన్
దీన సుజన బంధు! శ్రీ నృసింహా॥

* * *

ఆ. అఖిల లోక శంకర ఖలుఁడు కోపించి
ప్రాణహానికారి బహ్వాపాయు
శతము గూర్చెఁగాక; సద్భక్తు డడలునే!
దీన సుజన బంధు! శ్రీ నృసింహా॥

* * *

ఆ. ఒరుల కింత సౌఖ్య మెటుఁగూడు ననగఁ, దా
నిడుము లెన్నియైన బడయు నోర్చు;
ఒకడు దా సుఖింప నోరు నిట్టి పరిమార్చు
దీన సుజన బంధు! శ్రీ నృసింహా॥

* * *

ఆ. ఒరుల కుపకరింప నుత్సాహ పడు చుందు
రొరులనుండి నుంత యొల్ల రెపుడు,
నట్టి పుణ్య పురుషులందు నిన్ దర్శింతు
దీన సుజన బంధు! శ్రీ నృసింహా॥

ఆ. గర్వవంతు డగును గలుగ శక్తి యొకింత,
శక్తిహీనుడగును సజ్జనుండు;
తలతు నిన్నుగాన దక్షుడౌ సజ్జనున్
దీన సుజన బంధు ! శ్రీ నృసింహా॥

* * *

ఆ. శాశ్వతమ్ము మఱియు సర్వోన్నతము నైన
రుచిర పదము గనిన ధ్రువుని గాంచ
భక్తు డొంద గలుగు ఫలమేమొ తెలియదే!
దీన సుజన బంధు ! శ్రీ నృసింహా॥

* * *

ఆ. భక్తిఁ దలతు నెపుడుఁ బ్రహ్లాద నారద
వ్యాస శుక పరాశ రాంబరీష
ధ్రువ కుచేల సనక రుక్మాంగ దాద్యులన్
దీన సుజన బంధు శ్రీ నృసింహా॥

* * *

సీ. నిస్స్వార్థ బుద్ధియై నిరతమ్ము మది లోన
పరహిత చింతతో వరలు వాని
సనయమ్ము నిను గూర్చి అత్యంత నిష్ఠతో
ధ్యానించు భక్తుగాఁ దలచు చుందు;

తొలగింప దీనుల దుఃఖముల్ సతతము
పొనరించు సత్క్రియల్ పూని యెవ్వ
డాతని నీపూజ నాతత భక్తితో
గావించు ఘనభక్తుగా దలంతు:

గీ. బుధుల హృదయమ్మునకు గడు మోద మొసగ
బలుకు హిత మితమైనట్టి భాషణముల
నీవు మెచ్చెడి స్తుతులంచు నెంచుచుందు;
మేలు లిడు మేలు దేవ! మమ్మేలు నృహరి!!

* * *

సీ. శ్రమను లెక్కింపక స్వార్థ మాసింపక
సత్కృత్యముల్ పూని సలుపు నతడు,
నొరులింత గమనింప కున్నను దలపక
పరహితార్థము పాటు పడెడు నతడు,
తనకైన మోసముల్ దలచుటయే లేక
న్యాయమ్ము దప్పక నడచు నతడు,
నధికార విద్యా మహైశ్వర్యముల్ హెచ్చు
చున్నను వినయమ్ము నూను నతడు,

గీ. నిలను నీ యంశమున జనియించినట్టి
పురుష సింహుడె యని కడు ముదము తోడ
నెంచి మదిలోన ప్రణతుల నిడుచు నుందు
మేలు లిడు మేలు దేవ! మమ్మేలు నృహరి।

* * *

సీ. అది లేదె యిది లేదె యని లేనివే యెంచి
చింతల నొందక చిత్తమందు,
పరమేశ్వరు డొసంగ బడసితి నివి యంచు
కలిగిన సుఖములన్ గణన సేసి,
ఒరు లేమి తనకు చేసిరి! యని యాశతో
కలలోన గూడ తా దలప బోక,
తా నేమి యొరులకు తగ జేసితి నటంచు
నెపుడు దా దననె ప్రశ్నించు కొనచు,

గీ. నిన్నె హృదయమ్ము నందున నిల్పుకొంచు
బుధ జనుం డెట్లు వర్తించు ముదము తోడ,
వరల జేయుము మమ్ము నీ కరుణ నటులె
మేలు లిడు మేలు దేవ! మమ్మేలు నృహరి॥

క. ఎందును నీసద్భక్తుం
డొందడు నైరాశ్య; మెప్పుడు నుత్సాహ మహా
నందమ్ముల నడుగడుగునఁ
జిందించుచు స్వీయ విధులు సేయున్ నృహరీ॥

* * *

క. ఘనమగు భక్తి, విరక్తియు,
జన హిత కర్మమ్ము మఱియు జ్ఞానము నెల్లన్
దనరు నభిన్నములయి
అనవరతము నీదు భక్తు లందున్ నృహరీ॥

* * *

క. చెప్పను పది కారణముల
నొప్పని పని చేయు నతఁడె, ఒప్పగు కార్య
మ్మొప్పుడు సత్పురుషుడు దా
జెప్పకయే కారణమును జేయును నృహరీ॥

* * *

క. జీవిత మిది క్షణ భంగుర,
మా విషయము తథ్య, మైన నా క్షణములలోఁ
గావించి రెందరో ఘను
లీ వసుధకు వలయు మేలు లెన్నియొ నృహరీ॥

క. జను లొనరించెడి స్తుతితో
పని లేకయె దీక్షతోడ పరహిత రతులై
పొనరింతురు సత్కృతు లెవ?
రనిశము స్తుతి నొంద వారె యర్హులు నృహరీ!

* * *

క. పరమాత్మ! మాకు నీవే
పరమాప్తుడ, వీవె మాదు భయ మణపగ సత్
పురుషుల రూపమ్మున మము
దరిసి వెసన్ బ్రోతు వెపుడుఁ గృపతో నృహరీ!

* * *

క. వడి వడి దౌష్ట్యము నణఁపగ,
నిడగన్ మోదమ్ము బుధుల కెంతయుఁ బ్రీతిన్
గడు నిర్భీతిన్ జరియిం
చెడి యా నరుడున్ ధర నరసింహుడె నృహరీ!

* * *

క. ఆరయుచునె ఖలుల, నొరులకు
శ్రేయమ్ములు గూర్చు పురుష సింహుల మదిలో
నే యుజ్జ్వ లాశయమ్ములు
మాయక మెసగెడినో, యొసగు మా కవి నృహరీ!

క. గాన మొక లేశంబున్నను
గని మెచ్చెడి యమృత సింధు కల్ప స్వాంతుల్
మనసార మెచ్చు సత్కృతు
గానించెడి సుకృత మింత యొసగుమి నృహరీ !

—: 0 :—

## 9. సృష్టివైచిత్ర్య బిందువు

శ్లో. వేద్యా క్వచి, త్క్వాపి చ నైవ వేద్యాః
రమ్యా క్వచి త్క్వాపి చ ఘోర రూపా!
మోదావహా క్వాపి చ ఖేద దాత్రీ
సృష్టి ర్హరే శ్చిత్ర విచిత్ర రూపా॥

* * *

క. ఎన్నో పూలను, ముళ్ళను
కన్నులతోఁ గనుచుఁ దనియ, గనుచునె కినియన్
పన్నుగతులఁ బొగడ, తెగడన్
గ, న్నీ లోకమున నీవె నెఱపెదు నృహరీ !

క. కనఁ గనగ వింత యగు రీ
తిని నీ వీ సృష్టి సేసితివి గద! అరయన్
నిను గొల్చుట అజ్ఞానమె
అను నరులకు నీదు సృష్టి యాఁ గదె! నృహరీ!

* * *

క. నీ లీల లమాయకు గ
ర్వాలాపములకు, మహా బలాఢ్యుని వినయ
శ్రీ లసిత వర్తనమునన్
గ్రాలుచు నీరీతిఁ దెలుపు గాదే నృహరీ!

* * *

క. అజ్ఞాన లవ మెట్టిదొ కో
విజ్ఞానుల ప్రజ్ఞ యందు, విజ్ఞానాంశ
మ్మజ్ఞుల కృతు లందున నీ
ప్రజ్ఞా విలసితము లగుచు వరలును నృహరీ!

* * *

క. ఎవ్వాఁ డే యెడ నెంతగ
నెవ్విధి నీ యిచ్ఛ మెయిని నెనయగ వలెనో,
అవ్వాఁ, డాయెడ, నంతగ
నవ్విధి, నవ్వాని నొందు నందురు నృహరీ!

క. కననగు దోషము లొక్కొ-
క్కని పనిలో నొకని కెపుడు గాంచగ, సర్వుల్
దనియుచు మెచ్చు పదార్థం
బును నీవే సృష్టి సేయఁ బోవట నృహరీ!

* * *

క. నీ కడకు చేర గోరెదు
మా కిట జూపితివి కరుణామార్గము లెన్నో;
నా కచ్చెరువగు మఱి యవి
యే కూర్చును మాకు శంక లెన్నో నృహరీ!

* * *

సీ. నవ్వుదు నొక్కని నడతను గని నేను,
నను జూచి యొక్కండు నవ్వుచుండె;
నొక్కని గని జాలి నొందుచుందును, నా య
శక్తికి నొక్కండు జాలి నొందు;
ఒక్కని మోసముల్ లెక్కింతు నే, నిక
నొకడు నా మోసమ్ము లుగ్గడించు,
మ్రొక్కును నను గోరి యొక్కఁడు, వే ఱొక
డింతయు నను గణియింప కుండు;

ఆ. విజ్ఞు డిత డని యొకని నే వినుతి సేయ,
నట్టి మూర్ఖుడు లే డెట నను నొకండు;
నీ విలాసము లన నివె కావె! యీశ!
మేలు లిడు మేలు దేవ మమ్మేలు నృహరి॥

* * *

సీ. అడుగడుగునను మా కనుమానమే యగు,
సంశయాత్ముల కీవు చాల దవ్వు;
ప్రత్యక్షమును గాని గ్రహియింప జాలము
సంచరింతువు పరోక్షముగ నీవు;
యత్నింప నాయాస మగు చుండె మా కన,
యత్నించు సంతత మందు వీవు;
కోరికల్ దీరక కుందుచుంటి మనంగ
కోయు మందువు, ముందె కోరికలను;

ఆ. క్లేశములు మేము సహియింప లే మనంగ
క్లేశములె గూర్చి మిముఁ, బరీక్షింతు వంచు
వింత జ్ఞానమ్ము, శక్తి యా యీవె యొసగి
మేలు మార్గమ్ము చూపి మమ్మేలు నృహరి!

సీ. ఎల్లరు ధర్మజులే యౌట చాలదు!,
శకునులున్ వలయు నీ జగతి కెపుడు;
సృష్టి నిండుగ సీతలే యుంట చాలను,
తోడనే మంథరల్ కూడ వలయు;
నిత్య తృప్తులు, సత్య నిరతులే చాలరు,
వలయు ఘాతుకులును, వంచకులును;
మల యానిలములు వెన్నెలలునే చాలవు,
వలయు నుప్పెనలు నుత్పాతములును,

గీ. ఈ విరుద్ధ విభిన్న స్వభావములను,
సృష్టి నిర్మాణ కారణ త్రిగుణ గతులఁ
దెలియఁ గలవారె గద నిన్ను దెలియఁ గలరు!
మేలు లిడు మేలు దేవ! మమ్మేలు నృహరి!

* * *

౨. మా చేయు చేతలు నీ చేతనే, యైన,
నంటని ముట్టని యటులె యుందు;
వెల్ల చోటుల నీవె యేపారి యున్నను;
కనులకు మా కింత కానరావు,

మే మెన్నతే నన్ని మేళ్ళు గూర్తువు, కాని
నిర్దయుండను నింద నీవె యోర్తు;
నెఱుఁగగా వలె ననియెంత తపించినన్,
దెలియ నీయవు నీదు తీరు మాకు;

గీ. తెలివి, సంపద, సౌఖ్యమ్ము గలుగఁ జేసి,
యెంతొ గర్వింపఁ జేసి హరింతు వపుడె;
తెలివి, తెలుపక మమ్మింత త్రిప్పనేల?
మేలు మార్గమ్ము చూపి మమ్మేలు నృహరి!

* * *

సీ. మానియై యుండును జ్ఞాని విరక్తిన
జ్ఞాను డాసక్తి వాచాలు డగును;
బలహీను డెంతయు పౌరుష వంతుడౌ
దృఢ కాయు డరయ నధీరు డగును;
దాత యహంచుండు నిర్ధనుడు కృపాళువై,
ధనికుడు లోభియై దాగి యుండు;
వికృత రూపు డమూల్య వేష భూషలు దాల్చు,
రమ్య దేహుండు విరాగి యగును;

సీ. కొన్ని ఘనతలు, లోపముల్ గూర్చి యిట్లు
విశ్వ సువిచిత్రనాటక వేదియందు
నిలిపి యాడింతె! మమ్ము నీ నేర్పు మెఱయ
మేలు లేదు మేలు దేవ! మన్నేలు నృహరి॥

—:0:—

## 10. శరణాగతి బిందువు

శ్లో. శ్రీశం హృషీకేశ మనీశ మీశం
ధూతారి పక్షం శ్రిత కల్పవృక్షమ్,
సర్వేశ్వరం సర్వశరణ్య మాద్యం,
శ్రీనారసింహం శరణం ప్రపద్యే॥

* * *

ఆ. అహరహము జపింతు నృహరి! నీ నామమ్ము,
పవలు రేయి నిన్నె భక్తిఁ దలతు,
జన్మ జన్మమునను స్వామి నన్నేడకు
దీన సుజన బంధు! శ్రీ నృసింహ॥

ఆ. నిను స్మరించి పొందు నిర్మలానందమే
జ్ఞాని కోరదగిన సార మనుచు
తెలిసి ఇతర సౌఖ్యముల చింత విడుమన్
దీన సుజన బంధు! శ్రీ నృసింహ।

* * *

ఆ. పాడుదు నిను స్వామి! ప్రహ్లాదు రీతిగా
పాహి భక్త వరద! పద్మనాభ!
నాథ! చక్రహస్త! మాధవ! హరి యనుచు
దీన సుజన బంధు! శ్రీ నృసింహ।

* * *

ఆ. చంపక నవ పుష్ప చారు దామ విభూష!
చందన ద్రవ లిప్త సుందరాంగ!
విబుధ మకుట రత్న విలసిత పదపీఠ!
దీన సుజన బంధు! శ్రీ నృసింహ।

* * *

ఆ. ఆది యుగమునందు ప్రాదుర్భవించిన
మనుజ మూర్తి వీవె! దనుజ హరణ!
పురుష సింహుడీవె, పురుషోత్తముడ వీవె,
దీన సుజన బంధు! శ్రీ నృసింహ।

ఆ. నిను మృగేంద్ర వదన ! వినుతింప శక్యమే !
అల్లి వాల్గు నైదు నాలు వేయు
నాననములు గల్గు నా వేల్పులకు నైన
దీన సుజన బంధు ! శ్రీ నృసింహ !

* * *

ఆ. కుక్షి సంభృత బహు కోటి జగ త్తతి
నైన నీదు రూపు నే నెఱింగి
స్వామి! నిన్ను గొల్తు సచ్చి దానందుగా
దీన సుజన బంధు శ్రీ నృసింహ !

* * *

ఆ. కోటి కోటి భువన గోళ సృష్టి స్థితి
విలయ కారి నీదు విశ్వ రూప
మెదుట నిలచి నట్లె మది నిండు నిన్నెన్న
దీన సుజన బంధు ! శ్రీ నృసింహ !

* * *

ఆ. అణువు కంటెఁ గూడ నణు తరుండవు నీవు,
మహ దధికుఁడ వీవె మదిని దలప;
నీవు లేనిదేది? నీవు కానిది యేది?
దీన సుజన బంధు ! శ్రీ నృసింహ !

ఆ. స్వామి! నిన్ను గందు సాంధ్య గగనమందు,
జోసి పాప నిండు హాస మందు
మనసు నంటి మెదలు మధుర గీతిక యందు
దీన సుజన బంధు! శ్రీ నృసింహా॥

* * *

ఆ. కొలువగ నిను స్వామి పలుతావులన్ నీవు
వెలసి నావు మాదు తెలుగు నాట!
తెలుగు గడ్డ తీపి తెలిసెనో నీకును
దీన సుజన బంధు! శ్రీ నృసింహా॥

* * *

ఆ. అజ్ఞుల మయి చేయు నపచార మెన్నక
కృప దలిర్పఁ బ్రోతు వెపుడు మమ్ము
చన్ను గుడుచు బిడ్డ తన్న నల్గునె! తల్లి
దీన సుజన బంధు! శ్రీ నృసింహా॥

* * *

సీ. "సాధు జీవనులకు సంరక్షణము గూర్ప
క్రూర వర్తనులను గూలఁ జేయ,
ఇల ధర్మమార్గము నెలకొనఁ జేయగా
నుద్భవింతును ప్రతి యుగము నందు;

అవని నెప్పుడు ధర్మ మణాగఁ ద్రొక్కఁబడు,
హెచ్చి అధర్మమ్ము పెచ్చు మీఱు,
నప్పు డెల్లను నేనె ఆ యాయి చోటుల
వివిధ రూపములతో వెలయు చుందు॥

గీ. ననుచు సుజనుల కెప్పుడు నభయ మిడుచు
ధర్మ సమ్మత మార్గ వర్తనము సేయ
తోడు నీడగ నుండెడి వాడ వీవె,
మేలు మార్గము చూపి మమ్మేలు నృహరి॥

* * *

సీ. చర ణాంబుజమ్ములు జగ దఘ హారిణి
జాహ్నవీ మాతకు జన్మ భూమి,
ఉదర మందిర మది పదునాల్గు భువనముల్
పదిలమై యుండెడి భద్ర పదము,
నాభీ సరోజమ్ము నాల్గు మోముల సామి
జగములు నిర్మించి నెగడు చోటు,
వక్షస్థలము సిరి వసియించి లోక మా
తృత్వమ్ము నందిన దివ్య పదము,

# శ్రీ నరసింహ కర్ణామృతము

తే. అక్షు లరయ జగత్కర్మ సాక్షు లంట!
కరము లవి వర దాభయ కరము లాయె;
ఇన్ని గల్గిన దొరవు నిన్నెన్న దరమె!
మేలు లిడు మేలు దేవ! మమ్మేలు నృహరి!

* * *

సీ. సుజ్ఞాన ఘన తపో విజ్ఞేయ! రూపుడ
వజ్ఞుల కజ్ఞేయు డయ్యు నీవు
భక్తులా నరులపై పరమ కారుణ్యమున్
జూపి మున్ నరసింహ రూప మొంది,
వామన నరుడవై, ప్రాంశు నరుండవై
క్రమముగ వర్ధిల్లి కరుణ మెఱపి
ఒకట ధృష్ట నరుడ వొకట శాంత నరుడ
వై నరులకు శ్రేయ మందఁ జేయు

తే. నర సఖుండవుగా వచ్చి ధరణి నీవె
నరుని ధర్మానువర్తన పరత మెచ్చి
జ్ఞాన మిడి ప్రోచి విజయ మొనర్చ లేవె!
మేలు లిడు మేలు దేవ! మమ్మేలు నృహరి!

సీ. పంచ భూతమ్ముల మించి యావల వెల్గు
　　పరమాత్మ తత్త్వమై వరలు నెవడు,
ఇంద్రియమ్ముల శక్తి కెంతయు నందక
　　అనుభూతి వేద్యుడై తనరు నెవడు,
ప్రాణాన్న బుద్ధి విజ్ఞాన కోశమ్ముల
　　కవ్వలి యానంద మగు నెవండు,
సత్త్వ రజ స్తమ స్త్రైగుణ్య ధర్మమ్ము
　　లంటక తనకు దా నలరు నెవడు,

గీ. నిఖిల విశ్వంబు తన యందె నెగడు చుండ
అణువు నణువున వ్యాపించు నణగి యెవ్వ
డట్టి నిను గన గోరుదు మయ్య! కరుణ
మేలు మార్గమ్ము చూపి మమ్మేలు నృహరి!

* * *

సీ. సాధ్యమా నెట్టి లీసత్కార్య మనుకొన్న
　　నెన్నొ మాచేతఁ జేయించి నావు;
తప్పునే యింతటి దారుణా పదలని
　　వెఱచిన వానిఁ దప్పించి నావు

కాఱు మబ్బుల వోలెఁ గ్రమ్మఁగా వెతలు, మా
మదిఁ గూర్చితివి ధైర్య మహిత కాంతి,
ఆవేళ పరతఁ గోల్పోవగా సన్మార్గ
మును జూపి మము దయఁ బ్రోచినాఁడ,

గీ. వెఱుఁగఁ గల్గిన నీ మేలు లెన్నొ యున్న,
వే మెఱుంగని మేలు లింకెన్ని గలవొ?
తెలుగునే మేలు? మాకీవు కలుగకున్న!
మేలు మార్గమ్ము చూపి మమ్మేలు నృహరి!

* * *

సీ. ఆహార నిద్రాది దేహ ధర్మముల ని
ర్వాహమ్ము కొఱకయి ప్రాకులాట,
కాయమ్మునకు నే యపాయమ్ము లేక దీ
ర్ఘాయువు నొందగ ప్రాకులాట,
శత్రు నెదిర్చి కళత్ర మిత్రులఁ గూర్చి
స్వబలమం బెంపగ ప్రాకులాట,
సంతానము గనంగ సంతోష పడి దాని
వంతలు తొలగింప ప్రాకులాట,

గీ. ఏమి తెలుగు నెఱుఁగును దోష మెల్ల;
ఎల్ల జీవులు బ్రదుకగా నెఱుఁగుఁ గాని
నిన్నుఁ అంగుట యది మేము నేర్తు మయ్య!
మేలు లిడు మేలు దేవ! మ మ్మేలు నృహరి!

* * *

సీ. పుత్ర పౌత్ర క్షేత్ర మిత్ర బంధు కళత్ర
భర్మ హర్మ్యా రామ పశు గణాది
సంపదల్ దినదిన సంవర్ధితమ్ములై
కోరికల్ పెక్కులు దీఱ కొలది
సౌఖ్యము ల్లభియించి, సంతుష్టి చేకూరి
మనుజుండు నిశ్చింత మనగ వలదె!
హరి హరీ! యెవ్వారి నారయ నీ ధరన్
గోరికల్ దీఱక కుందు వారె!

గీ. కలదె సౌఖ్యమ్ము భవ భోగ కలన చేత?
అస్థిరమ్ములు జగతి సౌఖ్యమ్ము లెల్ల
స్థిర సుఖ మ్మది నిను గూర్చు చింత యొకడె
మేలు లిడు మేలు దేవ! మ మ్మేలు నృహరి!

## శ్రీ నరసింహ కర్ణామృతము

సీ. మనసిచ్చు సుజనుని మైత్రి చేకూరుట
అవనిపై అమృతమ్ము ప్రాప్త మగుట,
"మీరు చేసితిరయ్య మేలు మాకిది యెల్ల"
అని జనుల్ మెచ్చుట అమృత మనగ
సద్గ్రంథ సువిమర్శ సమ్మోద మబ్బుట
వసుధపై లభియించు సుధయె యగును
స్త్రీ పూరుష సాహచర్య భాగ్యమ్మన్న
ఉర్విపై దొరకు పీయూష మగును

గీ. ఇట్టి యీ అమృతమ్ముల నిచయము గ్రోల
నిపుడె ఫలియించి మాకు లభించె నీదు
అంఘ్రి పంకజ స్మరణ దివ్యామృతమ్ము
మేలు లిడు మేలు దేవ! మమ్మేలు నృహరి!

* * *

క. నరసింహా నీదు నామమె
నరులకు నిర్వాచ్య దివ్య నవ్యోత్తేజ
స్ఫురణమ్ము కూర్చి కూర్చును
పురుషార్థ ప్రాప్య విభవ పూర్ణత నృహరీ!

క. నర కేసరి! నీ సరిగా
వర దాయకుడగుచు వరలు వర దైవత మీ
ధరణిన్, గిరులన్, గన గో
చరమా నెట! మాకు నీవె శరణము నృహరీ!

* * *

క. శరణము నీ చరణములే,
తరుణోపాయమ్ము మాకు తత్కరుణయె నీ
కరుణను గను మార్గముగా
నరులకు నిరతమ్ము మేలొనర్తుము నృహరీ!

* * *

క. నరసింహా! నిను భజించెడి
నరు డెట్టును పరము నొందు నరసింహుడె యౌ;
నరులన్ సింహమ్మనబడి
ధరణి న్నరసింహుడౌ నతండిట నృహరీ!

* * *

క. ధనియౌ; బలియౌ, సుఖియౌ
అనుపమ విఖ్యాత దాతయౌ, మాన్యుండౌ
నిను ఈ భువి నొక పరి ని
ష్ఠను నరు డర్చింప జన్మ జన్మము నృహరీ!

సీ. మనసిచ్చు సుజనుని మైత్రి చేకూరుట
అవనిపై అమృతమ్ము ప్రాప్తమగుట,
"మీరు చేసితిరయ్య మేలు మాకిది మెల్ల"
అని జనుల్ మెచ్చుట అమృతమగు
సద్గ్రంథ సువిమర్శ సమ్మోద మబ్బుట
వసుధపై లభియించు సుధయె యగును
స్తవ్య పూరుష సాహచర్య భాగ్యమ్మన్న
ఉర్విపై దొరకు పీయూష మగును

గీ. ఇట్టి యీ అమృతమ్ముల నవియె గ్రోల
నిపుడె ఫలియించి మాకు లభించె నీదు
అంఘ్రి పంకజ స్మరణ దివ్యామృతమ్ము
మేలు లిదు మేలు దేవ! మమ్మేలు నృహరి!

* * *

క. నరసింహా నీదు నామమె
నరులకనిర్వాచ్య దివ్య నవ్యోత్తేజ
స్ఫురణమ్ము గూర్చి కూర్చును
పురుషార్థ ప్రాప్య విభవ పూర్ణత నృహరీ!

క. నరకేసరి! నీ సరిగా
వర దాయకుడగుచు వరలు వర దైవత మీ
ధరణిన్, గిరులన్, గన గో
చరమౌ నెటు! మాకు నీవె శరణము నృహరీ!

* * *

క. శరణము నీ చరణములే,
తరణోపాయమ్ము మాకు త్వత్కరుణయె నీ
కరుణను గను మార్గముగా
నరులకు నిరతమ్ము మేలొనర్తుము నృహరీ!

* * *

క. నరసింహా! నిను భజించెడి
నరు డెట్లును పరము నొందు నరసింహుడె యగున్;
నరులన్ సింహమ్మనబడి
ధరణి న్నరసింహుడౌ నతండిటు నృహరీ!

* * *

క. ధనియగున్; బలియగున్, సుఖియగున్
అనుపమ విఖ్యాత దాతయగున్, మాన్యుండౌ
నిను ఈ భువి నొక పరి ని
ష్ఠను నరు డర్చింప జన్మ జన్మము నృహరీ!

క. వారికి శుభ మగు, జయ మగు,
వారి కనిష్టమ్ము లెపుడు వాటిల్ల వెటన్;
కోరి తమ హృదయ మందె
వ్వారలు నిను నిల్పుకొంద్రు వారక నృహరీ!

* * *

క. రక్షకుడుగ శిక్షకుడుగ
దక్షుండుగ నపేక్షఁ బ్రాణి తతులను మనుపన్
సాక్షిగ పరోక్ష వర్తిగ
సీక్షింపగ నేక్షణమ్ము నీవే నృహరీ!

* * *

క. పదునాలుగు భువనమ్ములు
నుదరములో నిలిచి యున్న ఊహాగమ్యా
త్వదుదగ్రరూప మది మా
మది నిలుచున్ దెలుప లేము మాటల నృహరీ!

* * *

క. వినువీధి భయద పర్జ
న్య నినాదము నీదు రౌద్ర హాసమ్మునుగా,
ఘన ఝంఝానిలములు నీ
కవదుగ్రోచ్ఛ్వాసములుగఁ గాంతును నృహరీ!

క. పరిఫుల్ల సరసిజములన్,
విరిసిన పున్నముల పండు వెన్నెలలన్; శ
ర్వరి యిరుల మెఱపులన్ నీ
కరుణామృత వీక్షణములె గాంతును నృహరీ!

* * *

క. నీ పావన సంస్మరణమె
యేపగు సంపద యటంచు నెంచెద నెపుడున్
నీ పాద విస్మృతియె ఘో
రాపద యనిపించు మాకు ననిశము నృహరీ!

* * *

క. మఱవ సదాచరణమ్మును
మఱవను మదిలోన నీదు స్మరణము నెపుడున్
దురి తాపహారణ చరణా!
తరియింతు భవాబ్ధి నింక తథ్యము నృహరీ!

—:0:—

క. వారికి శుభ మగు, జయ మగు,
వారి కనిష్టమ్ము లెపుడు వాటిల్ల వెటన్;
కోరి తమ హృదయ ముందె
వ్వారలు నిను నిల్పుకొంద్రు వారక నృహరీ!

* * *

క. రక్షకుడుగ శిక్షకుడుగ
దక్షుడుగ నపేక్షఁ బ్రాణి తతులను మనుపన్
సాక్షిగ పరోక్ష వర్తిగ
నీక్షింపగ నీక్షణమ్ము నీవే నృహరీ!

* * *

క. పదునాలుగు భువనమ్ములు
నుదరములో నిలిచి యున్న యోహోగమ్యా
త్వాదుదగ్రరూప మది మా
మది నిలుచున్ దెలుప లేము మాటల నృహరీ!

* * *

క. వినువీధి భయద పర్జ
న్య నినాదము నీదు రౌద్ర హాసమ్మునుగా,
ఘన ఝంఝానిలములు నీ
కనదుగ్రోచ్ఛ్వాసములుగఁ గాంతును నృహరీ!

క. పరిఫుల్ల సరసిజములన్,
విరిసిన పున్నముల పండు వెన్నెలలన్; శ
ర్వరి యురుల మెఱపులన్ నీ
కరుణామృత వీక్షణములె గాంతును నృహరీ!

* * *

క. నీ పావన సంస్మరణమె
యేపగు సంపద యటంచు నెంచెద నెపుడున్
నీ పాద విస్మృతియె ఘో
రాపద యనిపించు మాకు నని శము నృహరీ!

* * *

క. మఱవ సదాచరణమ్మును
మఱవను మదిలోన నీదు స్మరణము నెపుడున్
దురితాపహరణ చరణా!
తరియింతు భవాబ్ధి నింక తథ్యము నృహరీ!

—: 0 :—

## *11. కరావలంబ బిందువు :

శ్లో. "శ్రీమత్పయోనిధి నికేతన! చక్రపాణే!
భోగీన్ద్రభోగ మణిరాజిత! పుణ్యమూర్తే!
యోగేశ! శాశ్వత! శరణ్య! భవాబ్ధిపోత!
లక్ష్మీనృసింహ! మమ దేహి కరావలంబమ్"

* * *

సీ. సంసార దావాగ్ని సంకుల భీకర
హేతిచ్ఛటలు నన్ దహించు చుండ,
దగ్ధరోముడనయి త్వత్పదాబ్జసరస్సు
చేరి రక్షణమును గోరి యుంటి;
సంసార భీకర జాల మం దింద్రియ
ములు గాలమై గొంతుముడిని బట్ట;
తలయును, తాలువులును కలగి కంపించెడి
మత్స్యమ్ము రీతిని మలగుచుంటి

గీ. కమలభవ శర్వ శక్ర భాస్కర కిరీట
రత్న ఘట్టిత పద పద్మ రాగ రమ్య!
ఇమ్ము హస్తావలంబమ్ము నిచ్చి కరుణ
దీను నన్నుద్ధరించు లక్ష్మీ నృసింహ!

సీ. సంసార సాగర ఝష తిమింగిల గిల
గ్రాహ భీకర ముఖ గహ్వరాగ్ర
నిహిత శరీరుడ నిర్భర విష యోర్మి
పీడి తాత్ముడ, నిన్ను వేడుకొంటి
సంసార గహన సంచార ఖిన్నుడ, మన్మ
థ క్రూర మృగ భీతి ధావితుడను;
మత్సర గ్రీష్మ సంతాపత ప్తుడ, మోహ
గ ర్త మగ్నుడ, నన్ను గావుమంటి;

గీ. క్షీర సాగర మందిర ! సారసాక్ష !
శేష ఫణి ఫణామణి గణ భూషితాంగ !
ఇమ్ము హ స్తావలంబమ్ము నిచ్చి కరుణ
దీను న న్నుద్ధరించు లక్ష్మీ నృసింహ !

* * *

సీ. ఘనఘోరము నగాధమును నైన సంసార
కూపమ్మున న్గాలి కుములుచుంటి;
బహు విధ యాతనల్ బాధింపగా నొచ్చి
చరణమ్ము లాని, నిన్ శరణ మంటి;

భయకారి సంసార వారణ శుండా గ్ర
ఘాత నిష్పీడన జాత దుఃఖ
మేచుచుండగ జన్మ మృత్యుజ భయముచే
వ్యాకుల చిత్తుడ నగుచు నుంటి;

గీ. పద్మ సంభవ నుత పద! పద్మనయన!
యజ్ఞ! యజ్ఞ ప్రవర్తక! యజ్ఞనాథ!
యిమ్ము హ స్తావలంబమ్ము నిచ్చి కరుణ
దీను నన్నుద్ధరించు లక్ష్మీ నృసింహ!

* * *

సీ సంసార భీకర సర్ప మహోగ్ర దీర్ఘ
ఘోర దంష్ట్రా శాత కోటి దశన
నాశిత బల జీవి తాశుడ నయి నీకు
నాగారి వాహన! నతి యొనర్తు;
పాతక బీజమున్, బహు కర్మ శాఖమున్,
కరణ పర్ణమ్మును, స్మర సుమమ్ము,
దుఃఖ ఫలమ్మునౌ దుర్దాంత సంసార
వృక్షాగ్రమున భీతి వ్రేలుచుంటి;

గీ. హార పద్మాలయా కుచ సరసిజాత
రమ్య కేళీ సమాసక్త రాజహంస!
ఇమ్ము హస్తావలంబమ్ము నిచ్చి కరుణ
దీను నన్నుద్ధరించు లక్ష్మీ నృసింహ!

* * *

సీ. బలవదింద్రియ చోర పటలాపహృత వివే
క ధనుండ, కృపణ తాక్రాంతమతిని
ఘనతర మోహాంధకార కుహర మగ్న,
భోగ రోగార్త నన్ బ్రోవు మయ్య
ప్రహ్లాద నారద వ్యాస రుక్మాంగద
భీష్మాంబరీష విభీషణ శుక
శౌనక ముని పరాశర పుండరీకాక్షు
నాది సద్భక్తుల నట్లె గాచి

గీ. కరములన్ లక్ష్మి, శంఖ చక్రములు, పాండు
రాబ్జమును, నభయ వరద చిహ్నములు వెలయ,
ఇమ్ము హస్తావలంబమ్ము నిచ్చి కరుణ
దీను నన్నుద్ధరించు లక్ష్మీ నృసింహ!

—: 0 :—

---

గమనిక :- *ఈ బిందువు శ్రీ మచ్ఛంకర భగవత్పాదుల కరావలంబ
స్తోత్రమునకు స్వేచ్ఛాను వాదము.

## 12. మంగళ పంచకము

శ్లో. శౌరే! మురారే! నృహరే! ఖరారే!
విష్ణో! జయిష్ణో! శ్రితభీతజిష్ణో!
మాంగళ్య సంవర్ధిత భక్తలోక!
లక్ష్మీ మనోవల్లభ! మంగళం తే॥

* * *

ఆ. సర్వశక్తుడవుగ, సర్వజ్ఞుడవు నైన
నిర్వికారుడవగు నిన్ను మాకు
జనని యనుచు గనుసన్నల హృదినిల్చి
దీన సుజన బంధు! శ్రీ నృసింహ॥

* * *

ఆ. మారమాత! మా! రమా! కృపాంభోనిధీ!
మా మనవిని దెల్పి స్వామి కనుచు
మమ్ము కరుణఁ బ్రోచు నమ్మను గొల్తుము
దీన సుజన బంధు! శ్రీ నృసింహ॥

* * *

క. మా రమ, మాంగళ్యాలయ,
క్షీరాంభోనిధి తనూజ, శ్రితనరహరి, శ్రీ,
కారుణ్యసుధా శేవధి,
మారయు మా యమ్మ మము దయామతి నృహరీ!

క. మంగళ మంగజ జనకా!
మంగళ దేవీ ముఖాబ్జ మధురత భృంగా!
మాంగళ్య సంగ మహిమా!
అంగీకృత సుకృత! మంగళాలయ! నృహరీ!

* * *

శ్లో. మంగళం శ్రీనృసింహాయ
ప్రహ్లాదాభయ దాయినే,
మంగళం భక్త హృత్కంజ
పంజ రాంత ర్విహారిణే!

హరిః ఓం తత్ సత్



